## అందరూ మెచ్చిన చిత్రం!



చలం సమర్పించు
శ్రీ రమణ చిత్రవారి

# బుల్లెమ్మ బుల్లోడు

దర్శకత్వం: నాగాంజనేయులు







ముఖచిత్రం: తూర్పు వెలుగు - మందేహుల తరుగు

చిత్రకారుడు: వడ్డాది పాపయ్య


యువ సాలుచందా రూ. 18-00

దీపావళి సంచికతో రూ. 23-00

యువ, వడపళని, మదరాసు-26

విజయవంతంగా ప్రదర్శింపబడుతున్న చిత్రం!



ప్రసాద్ ఆర్ట్ పిక్చర్స్

# భార్యాబిడ్డలు

ఈస్ట్‌మన్ కలర్

నవయుగ

నిర్మాత: ఎ.వి. సుబ్బారావు దర్శకత్వం. తాతినేని రామారావు

NYKR.

ఏ విధమయిన అచ్చుపనులైనను
అతి చక్కగా...
అనుకొన్న గడువులో
మేము చేసి యివ్వగలము

★

మా ముద్రణశాలకు తోడుగా చిత్రకళాశాఖ,
బ్లాకు తయారీశాఖ, లితో-ఆఫ్‌సెట్
సంస్థలు సమకూడి వున్నవి.

★

ది బి. ఎన్. కె. ప్రెస్
(ప్రైవేట్) లిమిటెడ్
చందమామ బిల్డింగ్స్
వడపళని :: మదరాసు-26

ఆధునిక యంత్ర
పరికరములతోను
శాంకేతిక
నిపుణులతోను
అమరివున్న
బ్రహ్మాండమైన సంస్థ






ఆప్సెట్టు ప్రింటర్సు

ప్రసాద్ ప్రాసెస్ ప్రైవేట్ లి. మదరాసు-26

# ఫిలిం పరిశ్రమ
# సేవకు
# సిద్ధము




[illegible]

## విజయ స్టూడియోస్
## వాహిని స్టూడియోస్
## మదరాసు

RUNNING SUCCESSFULLY AT
NAVRANG CINEMA (AIR - COOLED) HYDERABAD

N. C. SIPPY Presents
UTTAM CHITRA'S

# MERE APNE

(EASTMAN COLOR)

*Starring:*

MEENA KUMARI * SUMITA SANYAL * VINOD KHANNA * SHATRUGHAN SINHA * DEVEN VARMA * ABHI BHATTACHARYA
ASIT SEN

*Friendly Appearances by*

MAHMOOD & YOGEETA BALI

*Written & Directed by*
**GULZAR**

*Music*
**SALIL CHOWDHURY**

PRODUCED BY

ROMU N. SIPPY
&
RAJ N. SIPPY

*Distributors for Nizam:*

B. MARIDESWARA RAO & Co.,

1141-3, Rashtrapathi Road,
SECUNDERABAD—3

# యువ

సచిత్ర మాసపత్రిక

సంచాలకుడు చక్రపాణి

సంపుటి 25 ఫిబ్రవరి — 1972 సంచిక 2


అనవసరంగా భారతదేశంతో యుద్ధం తెచ్చిపెట్టుకోవడం స్వయంకృతాపరాధం. అజ్ఞానం వల్ల బెంగాల్ రాష్ట్రాన్ని శాశ్వతంగా పోగొట్టుకొన్న పాకిస్తాన్, ఈనాడు సరియైన నాయకత్వం లేక విచ్ఛిత్తిని సమీపిస్తున్నది. 1971 లో జరిగిన ఎన్నికల ఫలితాలను గమనించి, ప్రజాభిప్రాయాన్ని మన్నించి, ప్రజాప్రతినిధులకు పరిపాలనను అప్పగించి వుంటే, పాకిస్తాన్ పాలకుడు యాహ్యాఖాన్ పదవీభ్రష్టతను పొందడం గాని, పాకిస్తాన్ విచ్ఛిత్తిని పొందడం గాని జరిగివుండేది కాదు. కాని, పాకిస్తాన్ పాలకులు ఈ విషయాలను రాజనీతిజ్ఞతతో ఆలోచించలేను. మత ప్రధానంగా భారతదేశాన్ని విభజించమని కోరి, ద్వేషభావాన్ని బాగా ప్రచారంచేసి, పాకిస్తాన్ స్థాపనను సాధించిన తరువాత, ద్వేషప్రచారంవల్లనే తమ అభివృద్ధిని సాధించగలమని పాకిస్థాన్ పాలకులు ఆశించారు. పాతిక సంవత్సరాలు, భారతదేశం ప్రగతిని సహించలేక విషం క్రక్కుతూనే వచ్చారు. చిట్టచివరకు, తమ విషప్రచారంలో తామే మునిగిపోయి, బెంగాల్ రాష్ట్రాన్ని శాశ్వతంగా నష్టపడ్డారు. పాకిస్తాన్ వ్యవహారాలు ఎలా నడిచినా, మామూలు పరిస్థితులలో మనకు వాటితో ప్రమేయం వుండేదికాదు కాని, కోటిమంది ప్రజలు బంగ్లాదేశ్‌నుంచి మనదేశంలోకి కాందిశీకులుగా రావడంతో, భరించరాని బరువు మన తలపైన పడింది. శాంతియుతంగా, యీ సమస్యను పరిష్కరించడానికి మనం [illegible]

పద్ధతితో పాకిస్తాన్ మనపై యుద్ధచర్యలకు దిగింది. తన గొంతు తానే కోసుకున్నది. పాకిస్తాన్ పరాజయం పొందడమూ, బంగ్లాదేశ్ శాశ్వతంగా విముక్తి పొందడమూ జరిగిపోయింది. భారతసైన్యాలు ప్రశంసార్హమైన విజయాన్ని సాధించాయి.

అయితే, యుద్ధంలో విజయం పొందడంతో మనం క్లిష్టపరిస్థితులనుంచి బైట పడ్డామని అనుకోవడానికి వీలులేదు. యుద్ధంలో విజయం సాధించడం ఒక ఎత్తూ, ఆ విజయం తరువాత శాశ్వతమైన శాంతి పరిస్థితులను నెలకొల్పడం మరొక ఎత్తూ. పరాజయం పొందిన పాకిస్తాన్, ఇప్పటికీ మనపట్ల ద్వేషప్రచారం సాగిస్తూనేవున్నది. ఆ దేశానికి వత్తాసుగా కొన్ని దేశాలు మనపట్ల అసూయాభావాన్నీ, ఆగ్రహాన్నీ ప్రదర్శిస్తూనే వున్నాయి. ఈ పరిస్థితులను మనం నిర్లక్ష్యం చెయ్యడానికి వీలులేదు.

పాతికేళ్ళనాడు స్వాతంత్ర్యం పొందినది మొదలు ఇప్పటివరకూ, మనదేశంలో పారిశ్రామికాభివృద్ధిని సాధించడంకోసం, మనం విదేశాల సహాయాన్ని చాలా ఎక్కువగా తీసుకున్నాము. సహాయాన్ని ఇచ్చిన దేశాలు, ఇలా సహాయాన్ని యివ్వడంలో తాముకూడా ఎక్కువగనే బాగుపడినప్పటికీ, మనల్ని యాచకుల క్రింద పరిగణించడం ప్రారంభించాయి. మన రాజకీయ విధానాలలో జోక్యం కలిగించుకోవడం మొదలు పెట్టాయి. ఈ పరిస్థితిని మనం ఇకముందు ఎంతమాత్రమూ సహించకూడదు.

విదేశాల సహాయం అవసరం లేకుండానే, విశేషమైన అభివృద్ధిని సాధించిన దేశాలు ప్రపంచంలో కొన్ని లేకపోలేదు. ఆ దేశాలలాగనే, మనంకూడా కేవలం స్వయంకృషితో మనకు ఉన్న సహజసంపదలను సక్రమంగా ఉపయోగించి అభివృద్ధిని సాధించే పద్ధతిలో ప్రణాళికలను తయారు చేసుకోవాలి. నిత్యజీవితంలో, అవసరంలేని వస్తువులను ఎన్నింటినో ఉపయోగించడం మనకు వాడుక అయింది. ఈ వాడుకను మనం పూర్తిగా వదలిపెట్టాలి. అవసరంలేని వస్తువులను ఉపయోగించడం మానిననాడు మనం విదేశాలనుంచి తెప్పించుకొనే వస్తువులలో దాదాపు ముప్పాతిక భాగాన్ని దిగుమతి చేసుకోవలసిన అవసరమే వుండదు. పరిశ్రమలకు కావలసిన యంత్రసామగ్రి విషయంలో కూడా, మనకు కావలసిన యంత్రసామగ్రిని మనమే తయారుచేసుకొనే పద్ధతిని అవలంబిస్తేనే, మనం నిజమైన ఆర్థిక స్వాతంత్ర్యాన్ని సాధించుకోగలుగుతాము పరాధీనతనుంచి విముక్తి పొందగలము. మేధావులైన ఎంతోమంది మన ఇంజనీర్లకు వృత్తి అవకాశాలు లభిస్తాయి. ఈ విధమైన స్వయంసంపూర్ణత్వాన్ని సాధించడం ఒక యేడాదిలోనూ, రెండేళ్ళలోనూ సాధ్యం కానిమాట నిజమే. కాని, ఎప్పుడో ఒకప్పుడు మనం యీ ప్రయత్నాన్ని ప్రారంభించక తప్పదు. ఎంత త్వరగా మనం యీ కృషి ప్రారంభిస్తే అంత త్వరగా మనం స్వయంసమృద్ధిని పొందగలుగుతాము.

మొన్న జరిగిన యుద్ధంలో, మనం ఎంతమాత్రమూ విదేశీ సహాయంమీద ఆధారపడకూడదనే విషయం బాగా స్పష్టపడింది.

ఆహారధాన్యాల ఉత్పత్తి విషయంలో మనం, గత పాతిక సంవత్సరాలూ విదేశీ సహాయం లేకుండా గడపలేకపోయాము. కాని, యీ సంవత్సరం స్వయంసమృద్ధిని సాధించగలిగాము. ఈ కృషిని ఇకముందుకూడా ఏ మాత్రమూ తగ్గించకుండా, ఆహార ధాన్యాల ఉత్పత్తిని ఇంకా ఎక్కువ చేసుకుంటూ, పారిశ్రామికంగా కూడా స్వయం సంపూర్ణత్వాన్ని సాధించడానికి మనం తీవ్రమైన కృషి చెయ్యాలి.

ప్రస్తుతం మన ప్రధాన మంత్రి, యీ విషయంలో మంచి ప్రచారం చేస్తున్నారు. విదేశీసహాయాన్ని విసర్జించి, మన పరిశ్రమలను పూర్తిగా మనమే అభివృద్ధి చేసుకోవలసిన అవసరాన్ని గురించి ప్రజలను ఉద్బోధిస్తున్నారు. ఇదే భావాన్ని, సుప్రసిద్ధ పరిశ్రమల యజమాని బిర్లాకూడా వ్యక్తం చేశారు. అంచేత, పరిశ్రమల యజమానులు ప్రభుత్వంతో సహకరిస్తేనూ, ప్రభుత్వం పరిశ్రమల యజమానులకు సంపూర్ణమైన సహాయాన్ని కలిగిస్తేనూ, మన పరిశ్రమలు అనతికాలంలోనే బాగా అభివృద్ధికి రాగలవు. దేశంలోని అన్ని వర్గాలవారికీ వృత్తి అవకాశాలు ఏర్పడడమే కాకుండా, కొన్ని కోట్లరూపాయలను సమర్పించి విదేశాల సహాయాన్ని పొందే దురవస్థనుంచి కూడా మనం విముక్తి పొందుతాము.

---

# ప్రకటన



"యువ" జనవరి 1972 సంచిక కావలెనని కొందరు వ్రాస్తున్నారు. సంచిక కావలసినవారు ఉత్తరాలు వ్రాసే బదులు, రూ. 1-50 మనియార్డరు చేసిన కాపీ పోస్టులో పంపుతాము. లేదా ఏజంటును అడిగి వారిద్వారా తెప్పించుకొనవచ్చును.

1, ఆర్కాట్ రోడ్,
వడపళని,
మద్రాసు-26.

మేనేజరు,
యువ.




"ఇదిగో మిమ్మల్నే! ఆ పేపరలా పడేసి, ఇలా నామాట వినండి. నిన్న రాత్రి నాకో పాడుకల వచ్చింది!" అంది శ్రీమతి.

"వస్తే నన్నేం చెయ్యమంటావ్? పేపరు చదవనియ్యకుండా నన్ను డిస్టర్బ్ చేస్తున్నావ్!" అన్నాను విసుగ్గా.

"మీరు నాకు వచ్చిన కల విని తీరాల్సిందే—ఎందుకంటే అది మీకు సంబంధించినది కనుక." అంటూ, నా చేతిలోని పేపరులాగి బల్లమీద పడేసింది.

"వినక తప్పదా?" అన్నట్లుగా శ్రీమతికేసి చూసేసరికి — విజయసూచకంగా నవ్వేసి, మొదలుపెట్టింది.

"నిన్న సాయంకాలం మనం పార్టీకెళ్లాం కదూ? — సరిగ్గా అదే దృశ్యం. మన తెలుగువాళ్ళం అందరం కలిసి, సరదాగా మాట్లాడుకొంటున్నాం. అంతలో, ఓ అందమైన పంజాబీ యువతి మన మధ్యకి తిన్నగా వచ్చేసి, మిమ్మల్ని ముద్దు పెట్టుకొంది! మీ తలలో వేళ్ళుపెట్టి, "డియర్ రావ్! నీకోసం నేనక్కడ వెయ్యికళ్ళతో కాసుకూర్చుంటే నువ్విక్కడ మీవాళ్ళతో మాటలెట్టుకొని కూర్చున్నావా? పద పోదాం." అంది గోముగా. అక్కడున్న మనవాళ్ళందరూ ఆశ్చర్యపడిపోయారు. నాకు నోటమాట రాక కొయ్యబారి పోయాను. అయితే నేను తేరుకొని మీ చెయ్యి పట్టు

కావి, 'ఎన్నాళ్ళనుండి ఈ భాగవతం!' అని కోపంగా అడిగాను. ఆ యువతి నన్నోతోపుతోసి, మిమ్మల్ని గట్టిగా పట్టుకొంది. అంతే మీరు .... మీరు ....''
శ్రీమతి ఆగింది.

''ఆ తర్వాత?....'' అన్నాను కొంత ఉత్సాహంగా.

''....కుక్కగా మారి ఆమె వెనకాల వెళ్ళిపోయారు. నేను ఏడుస్తూ గోల పెడ్తూంటే, అందరూ నన్నోదారుస్తున్నారు. అంతలోనే మీరు సన్నగా చిక్కిచిక్కిపోయి నీరసంగా లోపలికి వసున్నారు, మిమ్మల్ని చూసి ఏదో, అన బోయే లోగానే మెలుకువ వచ్చింది''

''ఈ వెధవ కల చెప్పడానికేనా, ఇంత హంగామా చేసింది?''

''కాదు. కాని మీమీద నాకు నిజంగానే అనుమానమేస్తోంది. కొన్ని రోజులుగా, మీ వాలకాన్నిబట్టి చూస్తే మీరు నిజంగా ఏ టక్కులాడి వలలోనో చిక్కుకున్నట్లుగా ఉంది! ఏమండీ, నిజం చెప్పండి! లేకపోతే అటువంటి కల నాకెందుకు రావాలి?''

''ఎందుకు వచ్చిందో, చెప్పనా?'' అన్నాను. ''సరే'' అన్నట్లుగా తల ఊపింది.

''నేనెవరికో దాసుణ్ణి కావటం లేదు. నీలోని మూర్ఖత్వానికి, స్వార్థానికి లొంగిపోతున్నాను. అదుగో....మూతి అలా పెట్టక, నే చెప్పేది విను. ఏదో మొగ వాణ్ణి కనుక నాకు కొంత స్వేచ్ఛ ఉండాలి. ఏదో ఆఫీసు స్నేహితులతో ఓ ఆదివారం యింగ్లీషు సినిమా చూస్తే, యింట్లో ఎవరో కాలం చేసినంతగా ఏడుస్తావ్! ఆ ఏడుపు భరించలేక ఇంగ్లీషు సినిమాలు చూడ్డం మానుకొన్నాను. హిందీ సినిమాల కెడ్తే, చంటి వెధవ అవసరాలకి లేస్తే నువ్వు కుర్చీలోంచి కదలవు! ఆ పాట్లన్నీ నేనే పడ్తున్నాను. పులిని చూసి నక్క వాత పెట్టుకొన్నట్లుగా....పక్కింటి మిసెస్ గుప్తా సిల్కుచీర కొంటున్నాంటే, దానికి రెట్టింపు ధర చీర తెచ్చేవరకూ ప్రాణం తోడేశావ్! ఇలా చెప్పుకొంటూ పోతే లక్షలు! నువ్వు నిద్రపోయినప్పుడు—నీలో, నిద్రాణితమైన మంచి మేల్కొంది. అదే కలలోని నువ్వు. నేను పైన చెప్పిన దుర్గుణాలన్నీ మూర్తీభవించి ఆ పంజాబీ యువతిగా మారాయి. అంటే నువ్వు కలగన్నది—నీ దుర్గుణాలనీ, వాటికి దాసోహం అన్ననన్నూ! ఇంకా....''

''ఇంకేమీ చెప్పఖర్లేదు....'' అంటూ శ్రీమతి అక్కణ్ణించి లేచి వెళ్ళిపోయింది.

నేను చెప్పిన వివరణ విం టే, ఫ్రాయిడ్ ఏమనుకొనే వాడో నాకు తెలియదు కాని—రెండు రూపాయలు పెట్టి కొబ్బరికాయ కొన్నప్పుడల్లా. (మేం ఉండేది కోనసీమ కాదు, కాశ్మీరు.) తన్నకిష్టమయిన కొబ్బరి పచ్చడి చేసే శ్రీమతి, ఆ రోజు నా కిష్టమయిన ''కొబ్బరి కోరా—శనగపప్పు'' కూర వండింది.




కొవ్విపాటి విజయలక్ష్మి

(గత సంచిక తరువాయి)

తాను వెళ్ళినది మొదలు అంతా చెప్పి "నువ్వు వెళ్ళి వాడికి నాలుగు రోజులు ఉండి కడుపునిండా అన్నంపెట్టు. మనిషేం బాగులేడు" అన్నాడు మూర్తి.

చెమర్చిన కళ్ళు తుడుచుకుని బాధగా నిట్టూర్చి "కడుపునిండా అన్నం లేకనా అతనలా అయిపోయాడంటారు.... నే నావాడే అనుకున్నాను" అంది శాంత.

"గతం వదిలెయ్. ప్రస్తుత కర్తవ్యం ఆలోచించు" విసుక్కున్నాడు మూర్తి.

"మనం గతం విస్మరించి అన్నీ జరిపించాము. గతం మరవలేక అతను కృంగిపోతున్నాడు .... జయంతే విడిచి పెట్టిందా? ఎంత తెగింపు? మనిషి కాల గతిలో మారకుండా ఉంటాడా?....ఎంత ఆలోచనారహితంగా ప్రవర్తించింది? ఏదో చిన్నపిల్లలు తొందరపడ్డారు. వాళ్ళు చేసిన ఈ పని సమర్థించడం మన ధర్మం. వెళ్ళి బలరామయ్యగారితో చెప్పండి."

"ఆయనకి తెలియదంటావా?" ఆమె మాట కద్దువస్తూ ప్రశ్నించాడు మూర్తి.

"మీకు తెల్పిందా? మీరు వెళ్ళేదాకా

ు తమ్ముడు మీకు తెలియపరిచేడా?....
జయంతి మూడునెలల క్రితం వెళ్ళి
పోయిందన్నారు మరి.''

''అవును మూడునెల్లయి అమ్మగారు వెళ్ళిపోయారని వాళ్ళ బంట్రోతు చెప్పాడు''

''ఆ అమ్మాయి చెప్పి ఉండదు. అలా తెలిపి ఉంటే ఏ తండ్రి స్థిమితంగా బతకగలడు? అది చిన్నది....యీ ఇంటి గోడ లనిపించుకుంది. నాకు చాలా బాధగా ఉంది. వెళ్ళండి. వెళ్ళి మీ తమ్ముడే పొరపాటుగా ప్రవర్తిస్తున్నాడని....ఎలాగోలా జయంతిని తీసుకు వచ్చెయ్యండి. ాళ్ళిద్దరూ సఖ్యంగా కాపురం చేసే ంరకూ .... నేనా బాధ్యత వహిస్తాను. ద్దర్నీ మందలిస్తాను. వెళ్లిరండి'' ఆర్ద్ర ంతంతో ఆతృతగా అంది శాంత.

భార్య హృదయౌన్నత్యాన్ని మెచ్చు న్నాడు మూర్తి. ''సరే నేను రేపు లా బలరామయ్యగారి దగ్గరకు వెళ్తాను. వ్వు మోహనగ్గరకెళ్ల. వాళ్ళేం పోట్లాడు న్నారో. ఆ అమ్మాయి యిప్పట్లో స్తుందో రాదో'' అన్నాడు మూర్తి.

''తమ్ముణ్ణి వెనకేసుకు వాళ్లతో ట్లాడి రాకండి.'' నవ్వింది చిన్నగా త.

''మీ చెల్లెల్ని వెనకేసుకు మావాణ్ణి ంచి హడలకొట్టకు. మోహనేమీ అన ే పిల్లేదు'' హెచ్చరింపుగా అన్నాడు ర్తి.

మూర్తిని చూస్తూనే దోసిట్లో మొహం దాచుకున్నారు బలరామయ్యగారు.

అతని విచారానికి కూతురూ అల్లుడూ విడిపోవడమే కారణంగా ఊహించిన మూర్తి, ''మామగారూ విచారించకండి. చిన్నపిల్లలు తొందరపడ్డారు. మనం మళ్లీ కలిపేద్దాం'' అన్నాడు అనునయంగా అతని చేతులు పట్టుకుంటూ.

''కలపడమేమిటి? నాకు తెలియదే'' కలవరంగా అన్నారు బలరామయ్య నిర్ఘాంతపోతూ.

''మీకూ తెలియదూ! వాణ్ణి చూడాలని మొన్న వెళ్లి జయంతి ఏదని అడిగితే, విడిపోయామని చెప్పాడు. సుమారు మూడు నెలలు కావస్తోందన్నాడు. వాణ్ణి మందలించబోతే, ఆ అమ్మాయి కోపి వెళ్లిందన్నాడు. పోనీ చిన్నపిల్ల. తెలియదు. లోపలికెళ్దాం పదండి. జయంతిని అడిగి వాళ్ళిద్దరి మధ్యా ఏం జరిగిందో కనుక్కుందాం'' అంటూన్న మూర్తి పసివాడిలా ఏడుస్తూన్న బలరామయ్యగార్ని చూసి, ''ఛ. ఛ. ఇదేమిటండీ పిల్లా లేవో పొరపాట్లు చేస్తూంటారు. అలా విడిపోయినంతమాత్రాన్న మీ అమ్మాయి నూరేళ్ళ బ్రతుకూ బండలపాలు కావిస్తానా? నా పిల్లలాటిది కదూ జయంతి'' అన్నాడు అతని కన్నీరొత్తుతూ.

''లేదు బాబూ! మీ కుటుంబ సాంప్రదాయం మీ భార్యాభర్తల మంచితనం విని నా పిల్లని మీ ఇంటి కోడల్ని

చేయ వ

చేశాను. మూడునెలల క్రితం మమ్మల్ని చూడాలని వచ్చింది జయంతి. మీమీద ఏమీ నేరాలు చెప్పలేదు. అఖర్కి మూర్తి గురించి ఏమీ చెడుగా చెప్పలేదు. అతను ఉత్తరాలు వ్రాయడం లేదేం? అని వాళ్ళమ్మ ప్రశ్నించేసి. అతనికి తీరికుండ దనో, ఉత్తరాలు వ్రాయడం అలవాటు లేదనో నవ్వేసేసి. మనిషి కాస్త చిక్కి పోయింది. వారం రోజులై ఏదోలా ఉంటూందని. అన్నం సరిగా తినడం లేదనీ మీ అత్తయ్య చెప్పింది. ఇంకే దేదో ఊహించి నేను పొంగిపోయాను బాబూ. కాఫీగ్లాసు చేత్తోపట్టుకునే జయంతి గది కెళ్ళాను. తల్లి కాబోతూన్న నా తల్లిని చూడాలని .... ఇంకేమిటి చెప్ప మన్నావ్? ఎలా చెప్పమన్నావ్ మూర్తీ. నా కూతురు మీ కుటుంబానికి అప్రతిష్ఠ తెచ్చిందని నిందిస్తావా? నాలా బాధ పడ్తావా? .... తనకోసం విచారించవద్దనీ. వెతికించవద్దనీ. తన్ను మళ్లీ వెతికి మీ ఇంటికి తెచ్చుకునే ప్రయత్నం మీరు చేస్తే ఆత్మహత్య చేసుకుంటాననీ ఉత్తరం దొరికింది .... ఎందుకు వెళ్ళి పోవాలి? ...నేనేం తక్కువ చేశాను?.... విడిపోయిందనుకో. దాని కిష్టంలేకపోయి నప్పుడు బలవంతాన ఇంట్లోంచి తగి లేస్తానా? నేను దానికి తండ్రిని కానూ.... నా డబ్బూ.. నా ఆస్తీ....దానికి అన్నం పెట్టలేవూ?....నా కెవరున్నారు మూర్తీ? కొడుకు అప్రయోజకుడు....అనే బాధ ఏనాడో విస్మరించాను. నా కొడుకు చాత కానివాడైతేమాత్రం నా అల్లుడు తెలివైన వాడు. నేను పోయినా నా బావమరదులు అన్నదమ్ముల్లా ఒకరి కష్టసుఖాలకి ఒకరు ఆదుతుంటూ బ్రతుకుతారనుకున్నాను.... ఛి....ఛీ. నా బ్రతుకూ .... నా ఆశలూ వ్యర్థమైపోయాయ్." బొంగురుపోయిన గొంతుతో దుఃఖావేశంతో అంటూ తల కొట్టుకున్నారు బలరామయ్య.

"ఇంట్లోంచి వెళ్లిపోయిందా జయంతి? .... అలా ఎందుకు చేసింది? మీకు ఉత్తరమెలా దొరికింది?".... దిగ్భ్రాంతుడై కొన్ని క్షణాల తర్వాత ప్రశ్నించేడు మూర్తి.

"ఎందుకు చేసింది? మేమిలా కుళ్ళి చావాలని....ఉత్తరం పక్కమీద వ్రాసి పెట్టి వుంది. దానికోసం వెతుకుతూన్న నాకు ఉత్తరం దొరికింది ...పద లోపలికి రా. కాళ్ళు కడుక్కో" అన్నారు బల రామయ్య.

"అలాగే కానీ .... మనం ఏమిటి చెయ్యాలిప్పుడు? ఏం చేద్దామంటారు?" ఆతృతగా అడిగాడు మూర్తి.

"ఏమిటి చేస్తాం? మనం వెతికిస్తున్నా మని దానికి తెలిస్తే చచ్చిపోతుందేమో! నా కడుపులో చిచ్చు పెట్టేస్తుంది. మా జయంతిని చాలా లోతుగుండె. ఎప్పుడూ ఏ మాటా తేలదు. అదేదన్నా అందో అలా చేసి తీరుతుంది....కాని ఎక్కడో బ్రతికివుందని తృప్తిపడతాం....రా....

యువ

కాఫీ తీసుకుందువు గాని.''

''వద్దండీ .... నా మనస్సేం బాగు లేదు.... వెతికించకుండా వదిలేద్దామా?.... వయస్సులో ఉన్న ఆడపిల్ల ఎవ్వరి దక్షతలేకుండా ఎలా బ్రతకగలదు మామ గారూ? కాస్త విదానంగా ఆలోచించండి'' మనస్సు సంబాళించుకొని ప్రాధేయ పూర్వకంగా వ్యాపూరిత హృదయంతో చలించే గొంతుతో అన్నాడు మూర్తి.

''సర్లే .... అలాగే ఆలోచిస్తాను. నువ్వేం ఆమెకోసం వాకబు చేయించకు. నామీద ఒట్టు'' అన్నారు బలరామయ్య.

వారిచ్చే అతిధి మర్యాదలు స్వీకరించ లేకపోయాడు మూర్తి.

వెళ్తున్న మూర్తిని మరొకసారి హెచ్చరించారు బలరామయ్య 'జయంతిని వెతకవద్దని.'

* *

సాయంత్రం ఐదుగంటల వేళ. డాక్టరు షాశి ఇంటి వీధి అరుగుమీద బెడ్డింగూ పెట్టి పెట్టుకుకూర్చుంది శాంత. వీధి గేటువైపు చూస్తూ.

క్రమంగా చీకటి పడుతూంది. హాస్పిటల్ కెళ్ళడాని క్కానీసం నౌకరన్నాలేదు ఇంటిదగ్గర అనుకుంటూండగా-వీధిగేటు తెరచుకువస్తున్నాడు దుప్పటి నిండా కప్పుకున్న చంద్రయ్య.

''ఎవ్వరు నువ్వు?'' ప్రశ్నించింది శాంత.

''డాక్టరుగారి నౌఖర్నండి. తమరు ఆరింటికొచ్చారా అమ్మా'' వినయంగా ప్రశ్నించాడు చంద్రయ్య.

''అవును అతని వదినని నేను. ఓ సారి హాస్పిటల్ కెళ్ళి నేనొచ్చాను అని చెప్తావా?''

''అసపత్రికా. ఉండరండి. బార్ కెళిపోయుంటారు.''

''బార్ కా? ఎందుకు. బార్ కెందుకు?'' కలవరంగా అడిగింది శాంత.

''పెద్దోళ్ళ సంగతులు మాలాటోళ్ళు చెప్పగూడదమ్మగోరు. పదీ పదకొండు గంటలేళ ఒస్తారు కదండి. సూద్దురు గాని'' అన్నాడు విచారంగా.

పదీ పదకొండు గంటలవేళ తాగి వస్తాడు కాబోలు .... తానేం చెయ్యా లిప్పుడు? చప్పున ఆమె కళ్ళల్లో నీరు తిరిగింది. తాను కాపరానికి వచ్చింది మొదలు వాత్సల్యంతో, ప్రేమతో గారాబంగా పెంచింది ఇందుకా? త్రాగుబోతుగా చూడ్డానికా? వదినా వదినా అని కొంగు పట్టుకు తిరిగి మారాంచేసే నా బాబు తాగుతున్నాడా! ఎందుకు తాగుతాడు. మనస్సు పాడు చేసుకున్నాడు. అందుకని తాగేస్తున్నాడు. అందుకే .... తాగుబోతు వాడితో కాపురమేమిటని పెద్దింటి పిల్ల అది. అది విడిపోయి వెళ్ళిపోయింది. ఏమేమో తలపోసి మూగగా రోదిస్తూన్న శాంతవైపు సానుభూతిగా చూస్తూ. ''మీది మంచి మనసులాగుంది అమ్మ గారూ!....తర్వాత బాబుని మందలిద్దురు




గాని కేరియరు తెస్తాను భోజనం చెయ్యండి'' అన్నాడు చంద్రయ్య.

''వద్దు నాకు. ఆకలి గాలేదు'' అంది శాంత. గంటలు యుగాల్లా గడుస్తున్నాయ్. చీకటిరాత్రి. ఆకాశమంతా మేఘం ఆవరించి సన్నగా జల్లులు కురుస్తున్నాయ్. నిండా పమిట కప్పుకు కూర్చున్న శాంత గేటు తెరుచుకు ఎవరో వస్తూన్నట్టు గమనించి దిగ్గున లేచి నిల్చుంది.

అతను తడబడే అడుగులతో విసురుగా వచ్చి గదితలుపు తాళం తీస్తూ ... ''నువ్వెవరు? ఎందుకిక్కడ ఉన్నావ్?'' ప్రశ్నించాడు.

''మౌళీ.'' అంది రోదనస్వరంతో శాంత.

''మౌళీ.... మౌళీ. అని పిలుస్తున్నావ్? నువ్వు మంజువా? రా. గదిలోకి రా అంటూ లోపలికి నడిచాడు మౌళి.

వణికేగుండెల్ని అదిమిపట్టి ధైర్యాన్ని పుంజుకుంటూ మౌనంగా గదిలోకెళ్ళిం పెట్టె బెడ్డింగూ పట్టుకుని శాంత.

తలుపు ఘడియపెడ్తూ. ''మంజు ఎంతసేపైె వచ్చావు?'' ప్రశ్నించా తేలిపోయే గొంతుతో.

''నే నెవరో పోల్చలేకపోతున్నావ మౌళీ.'' బాధగా ప్రశ్నించింది శాంత.

''ఎందుకు పోల్చలేను? నువ్వు మంజులవి. ప్రతి మనిషీ మంజుల కప్పించాలనే తాగుతున్నాను. తాగి కొత్తల్లో వారం రోజులు మంజు రాత్రులు. అంటే నేను మత్తులో ఉన ప్పుడు నాతో గడిపేది. తాగినప్పుడు వా

స్తాను కదా! ఏం తిట్టానో వెళ్ళిపోయింది. మళ్ళీ వచ్చావు కోపం పోయింది కదూ! బలంగా ఆమెను దగ్గరకు లాక్కున్నాడు.

అతని చెంపలు కందిపోయాయ్. అతనికి దూరంగా నిల్చున్న కాంత కోపం,దుఃఖంతో వణికిపోతూంది. "ఇంత ఒళ్ళు తెలియకుండా తాగేస్తున్నావన్న మాట!" అంటూ పెదవులు బిగబట్టింది. నిల్చున్నచోటే చతికిలబడి గోడకి జార బడ్డాడు మౌళి. ఆమె అతన్ని చూస్తూ హృదయం పగిలేలా ఏడుస్తూంది. అత నేవేవో తెలుగూ, ఇంగ్లీషూ అర్థం కాకుండా మాట్లాడేస్తున్నాడు.

కొన్ని క్షణాలు అలా దొర్లిపోయిన తర్వాత ఇప్పుడు మాట్లాడి మందలించీ లాభం లేదనుకున్న కాంత పక్కగదిలో కెళిపోయింది. మంజూ అని పిలిచే, ఏడ్చే మౌళి గొంతు వినిపించి, తన్నూ తన ఖర్మనూ దూషించుకుంటూ ఏడ్చింది కాంత.

ఉదయం ఎనిమిదైనా నిద్రపోతూనే ఉన్నాడు మౌళి. కాఫీ కాచి నెమ్మదిగా అతని గదిలోకి వచ్చిన కాంత, ఇంక మత్తు విడిపోయుంటుందనే ధైర్యంతో "మౌళి బాబూ!" అని పిల్చింది. అతని తల మృదువుగా సవరిస్తూ.

"ఎప్పుడు వచ్చావ్!" అంటూ దిగ్గున లేచికూర్చుని కాంతవైపు చూసిన మౌళి "నువ్వా! జయంతి వచ్చిందని అను కున్నాను" అన్నాడు నెమ్మదిగా తల వాల్చేస్తూ.

"జయంతి మళ్ళీ వస్తుందని నమ్మక ముందా మౌళీ నీకు? .... నాకు చాలా సంతోషంగా ఉంది. ఈ ఆరునెలలూ జయంతి, నీ దగ్గరకు నువ్వు కావాలనే తపనలో వచ్చేలాగునే ప్రవర్తించావా మౌళీ?....తర్వాత మాట్లాడుకుందాం.... కాఫీ తాగు రాత్రి భోజనం చేశావా?.... ఎంత చిక్కిపోయావ్? నీ వేషం నీ రూపూ ఎలా ఉందో ఎప్పుడన్నా అద్దంలో చూసుకున్నావా?"

"దుక్కలా ఉన్నరోజునా ఇలానే ప్రశ్నించావు నువ్వు!" అని నవ్వేసి లేచి మొహం కడుక్కోడానికి బాత్‌రూమ్ వైపు నడిచాడు మౌళి.

అతనిచేతికి కాఫీగ్లాసిస్తూ, "హాస్పి టల్‌కి భోజనంచేసి వెళ్తావా? టిఫినేమన్నా చేసేదా?" అడిగింది కాంత.

"నువ్వెప్పుడొచ్చావ్? ఇప్పుడేం బస్సులు లేవే. నిన్న సాయంత్రమే వచ్చి వుండాలి" అన్నాడు ఆమెవైపు బెదురుగా చూస్తూ.

"నీకేమీ గుర్తులేదన్నమాట" అంటూన్న ఆమె కళ్ళల్లో నీళ్లు తిరిగాయి.

"ఏమన్నా పొరపాటుగా ప్రవర్తిం చానా వదినా?" అడిగాడు కంగారుగా.

"నువ్వు మంజూలని మరచిపోలేకుండా ఉన్నావు. నేను మంజూల ననుకొని....

"వదినా? .... క్షమించు వదినా?... అప్పలు నిన్ను వేధించవద్దని అన్న

య్యతో చెప్పాను....ఎందుకొచ్చావ్?"

"ఎందుకొచ్చానా? హు. రాకుండా ఎలా ఉండగలను? .... నువ్వు ఇంత ప్రయోజకుడివై పోతూంటే ఆ సంతోషం వాడి కదూ? నీ రాగి బొట్టు క్రాపూ, తేనె కళ్ళూ, పాలబుగ్గలూ, ఎన్నిసార్లు మెచ్చుకున్నాను? నీ బుగ్గలు పుణికి ముద్దులాడేదాన్ని. నువ్వు పియుసి ప్యాసై వచ్చాక కూడా, నా యీ చేతుల్తో నీ బుగ్గలు పుణికి ముద్దుపెట్టుకుంటూంటే మంజుల నవ్వింది. మోళీ ఇంకానీకు ముద్దు వస్తున్నాడా అని. గుర్తులేదూ? ఆ చేతుల్తో విన్న....నీ చెంపలు కందిపోయేలా కొట్టాను బాబూ. తాగి వచ్చిన నిన్ను చూడలేక పోయాను .... నువ్వేదో పెద్ద డాక్టరువై మాకేదో సంతోషాన్ని గర్వాన్ని ఇస్తావని....మేము నీరుపోసి పెంచిన మొక్క పూలూ కాయలూ పళ్లూ బరువును మోస్తూ చూడముచ్చటగా ఉంటుందని ఆశలు పెంచుకున్నాం....మా గుండెల్లో మంటలెందుకు రేపుతున్నావ్. మనసు నెందుకిలా రంపంతో కోస్తున్నావ్. నువ్వెందుకిలా పతనమయి పోతున్నావ్? చెప్పు మోళీ చెప్పు ఎందుకిలా దిగజారి పోతున్నావ్?" ఆవేశం దుఃఖం సహించలేని బాధతో ప్రశ్నించింది శాంత.

"ఎవ్వరికైనా అయితే చెప్పాలేమో కాని....నీకు కారణం చెప్పాలా? నీకు తెలియదూ? నా యీ పతనానికి నువ్వు కారణం. నా జీవితం ఇలా విస్సారం చేసింది నువ్వు. నన్నెలా పెంచావో ... నాలో ఎలాటి ఆశలు రేపావో ...ఆ ఆశలన్నీ ఎలా . మళ్ళీ ఎలా నలిపి నాశనం చేశావో నీకు బాగాతెల్సు ... నువ్వు ... నువ్వు ... నా జీవితమిలా నాశనం చేసింది నువ్వు." నెమ్మదిగా నిదానంగ అన్నాడు. నిజాన్ని ఆమె సహించలేక పోయింది. "ఏమిటంటున్నావ్ నేను నీ జీవితం నాశనం చేశానా? ... విశ్వాస ఘాతకుడా?" అంటూ అతని చెంపపై బలంగా కొట్టింది.

"కొట్టు పదినా? ఇంతకన్నా ముక్క ముక్కలుగా నన్ను నరికెయ్. చంపెయ్ కాని మళ్ళీ అదేమాట అంటూ మ జయంతి పక్కన నన్ను చూడగలిగి దాన్ని తాగివస్తే చూడలేక పోయావా కొన్ని క్షణాలు నన్ను నేను మర పోవాలని తాగుతున్నాను....కొన్ని క్షణాలే కాదు శాశ్వతంగా ఈ ప్రపంచానికి దూరమయి పోతాను."

"బాబూ!"....పాతికేళ్ళ యువకుణ్ణి పసివాణ్ణిలా దగ్గరకు తీసుకుంది శాంత "వద్దు బాబూ....అలాటి ఊహ కలనైనా రానీయకు. నేను పెంచిన నా బాబు పరిస్థితులూ, వియోగాలూ తట్టుకోలే పరికి పందలా ఆత్మహత్య చేసుకుంటే నేను సహించలేను .. క్షమించరానితప్పు చేశానని ఇప్పుడనుకుంటున్నాను మోళీ నువ్వు మంజులనింత గాఢంగా ప్రేమించావని ఆమెను మరచి మరొక జీవిత

గతపలేవనీ ఊహించలేక పోయాను. నిజమే .... విన్నిలా పతనం చేసింది నేను .... ప్రాణం పోయే మందు నా కియ్యి మౌళీ .... నేను విన్నిలా చూస్తూ బ్రతకలేను. ఆమె వెక్కి వెక్కి ఏడుస్తూంది. అతని తల వేళ్ళతో నవరిస్తూ.

ఇద్దరికళ్ళూ వర్షిస్తూనే ఉన్నాయ్. గది తలుపులు తెరచుకుని మూర్తి లోపలికి రావడంతో, ఇద్దరూ గబగబా మొహం తుడుచుకున్నారు.

"జయంతి రాలేదా?" ఆత్రుతగా ప్రశ్నించింది శాంత.

అతను మౌనంగా కుర్చీలో చతికిల బడుతూ, "ఇద్దరూ ఏడుస్తునట్టున్నారు... ఏమిటి? సంగతి" అన్నాడు.

"ఛ .... ఛ .... ఏం లేదు. నువ్వు ఎక్కడికి వెళ్ళావ్?" అడిగాడు మౌళి.

"ఊ"....ముభావంగా అని, మళ్ళీ.. 'మౌళీ జయంతిని .... మరేం అను కను....కొట్టీ తిట్టీ బాధించే వాడివా?' అన్నాడు మూర్తి తమ్ముడి మొహంలోకి పరిశీలనగా చూస్తూ.

"ఏం ఎందుకలాటి సందేహ మొచ్చింది?" .. రోషంతో కందింది మౌళి వదనం.

"ఎందుకు వెళ్ళిపోయింది అయితే?"

"అడిగి వచ్చావేమో?"

"లేదు .... అన్నిఅడిగి మళ్ళీ మీ పురం పిలబెట్టాలనే ఆశతో వెళ్ళాను. కాని జయంతిలేదు."

"ఏమయింది?" అప్రయత్నంగా ప్రశ్నించాడు మౌళి.

"ఎవరికీ చెప్పకుండా ఇంట్లోంచి వెళ్ళిపోయిందట."

"ఇంట్లోంచి వెళ్ళి పోయిందా?"

ఒక్కసారి మౌళి వదనం వాడిపోయింది. అలా ప్రశ్నిస్తూన్న అతని గొంతు కంపించింది. ఆ రోజు వాడిన కలువలా ఉన్న జయంతి వదనం గుర్తొచ్చింది.

విల్చున్నచోటే కూలబడి మౌనంగా రోదిస్తుంది శాంత. మౌళీ, మంజూ, జయంతీ, ముగ్గురి జీవితాలూ ఇలా నలిగి పోవడానికి తాను, తన ఊహలూ, తన ఆశలూ, తన నేర్పూ కారణం. తానెలా పెంచింది మౌళిని? మంజూలనెలా పెంచింది? వారిలో ఎలాటి మమతలు నాటింది? గబగబా గతం ఎదలో కదులుతూంటే— ఆమె దుఃఖం ద్విగుణీకృతం కాసాగింది. ఎలాంటిది ఆ గతం? మౌళీ మంజూలనూ తానెందుకు పెంచింది? వాళ్ళెలాటి మమతలు పెంచుకున్నారు?

• •

కృష్ణపక్షపు తదియ చంద్రుడు ఉద యించి నడినెత్తి కొచ్చాడు. ఇల్లంతా నిశ్శబ్దంగా ఉంది. సన్నగా రాజేశ్వరమ్మ గురక వినిపిస్తూంది.

పిగ్గుగా తలవంచి కూర్చున్న శాంత చెయ్యి పట్టుకు లేవనెత్తుతూ "ఇలాగా.. ఇప్పుడు ఇంత తొందరగా ఎందుకు వెళ్ళి

యావ




చేసుకున్నానో, ఎవరూలేని పేద ఇంటి పిల్లను ఎందుకు చేసుకున్నానో చెబుతాను!'' అంటూ కిటికీ దగ్గరకు నడిపించి కిటికీ రెక్క తెరచి, ''అలా బైటికి చూడు! ఏమిటి కనిపిస్తూంది?'' ప్రశ్నించాడు మూర్తి నవ్వుతూ.

'మంజుల, మౌళీ నిద్రపోతున్నారు.' అంది శాంత.

''ఎలా?''

''ఎలా ఏమిటి? అమాయకంగా అందంగా ఉన్నాయి వారి వదనాలు.''

''అమ్మ రోగిష్టిదయిపోయింది. వాళ్ళను పెంచి పెద్దవాళ్ళను చేసే బాధ్యత నీది....వాళ్ళకోసం వాళ్ళ సంరక్షణ చేసే మనిషికోసం పెళ్ళి చేసుకున్నాను.''

శాంతకు నవ్వొచ్చింది. సిగ్గు సదలించుకుని నెమ్మదిగా అడిగింది. 'పాపం, పెళ్ళిచేసుకునే వయస్సింకా రాలేదా మీకు?'' అని.

''అబ్బో, బాగా మాట్లాడగలవే... వయస్సుంది నిజమే కాని .... అమె ఆరోగ్యవంతురాలై ఇల్లు సవరించుకుంటూంటే ఇంకా కొన్నాళ్ళు పోయాక చేసుకునేవాడిని. నెల రోజుల క్రితమనుకుంటాను. అమ్మకి అవాళ గుండె నొప్పి వచ్చింది. పిల్లల్ని జాగ్రత్తగా చూడమని పనిమనిషికి చెప్పి వెళ్ళిపోయాను ఆఫీసుకి. నేను తిరిగి వచ్చేసరికి మంజుల అమ్మ మంచందగ్గర కూర్చుని ఏడుస్తూంది మౌళి ఓదారుస్తున్నాడు. ఎందుకు ఏమిటి? అని ప్రశ్నిస్తే పనిమనిషి ఇదేదో అల్లరి చేసిందని కొట్టిందట. దాని బుగ్గలు కందిపోయి ఉన్నాయి. ఆకలేస్తూంది అన్నయ్యా—అంటూ ఏడుపు మొహం పెట్టాడు మౌళి. మాటరాక ఆయాసపడ్తూన్న అమ్మకళ్ళల్లోంచి నీళ్ళు తిరుగు

తున్నాయి. ఆ క్షణంలో అనుకున్నాను తొందరగా పెళ్ళి చేసుకోవాలని. అదే అమ్మ ఆయాసం తగ్గాక హెచ్చరించింది. చాలామంది కట్నంతో పిల్లనిస్తామని వచ్చారు. కాని నాకు కావాల్సింది కట్నం కాదు. నా తల్లిని-తన తల్లిగా నా తమ్ముళ్ళని తన పిల్లలుగా, మాటలేరాని పసిది మంజుల; దాన్ని గౌరవించి ప్రేమించే ఉన్నత హృదయమున్న వ్యక్తి నా భార్యగా రావాలి. అని, ఈ మాటలే నాకు సంబంధాలు తెచ్చిన రమణయ్య గారికి చెప్పాను. అప్పుడు ఆయన సంతోషంగానవ్వుతూ. "ఐతేమూర్తీ. తల్లీ తండ్రీ లేరు స్కూలుపైనలు చదివింది. వేలువిడిచిన మామగారింట్లో ఉంటుంది. చాలా నెమ్మదస్తురాలు కట్నమేమీలేదు. పెళ్ళేదో చేసేస్తారట. పిల్ల బంగారు బొమ్మలా ఉంటుంది' అన్నారాయన. ఎవ్వరు శాంతా! ఆ అమ్మాయి!" శాంత బుగ్గమీద చిటికె వేశాడు మూర్తి.

"పోండి...." సిగ్గుపడింది శాంత.

"నీమీద ఎక్కువ బరువుబాధ్యత ఉంచుతున్నాను కాబోలు."

"బరువూ, బాధ్యతా ఏమిటి!.... మీరు చెప్పేవని నా కర్తవ్య నిర్వహణలో ఓ భాగం అంతే...."

తృప్తిగా నవ్వి ఆమెను దగ్గరకు తీసుకున్నాడు మూర్తి.

"మంజులా, మోళీ అందంగా బొమ్మల్లా ఉన్నారు. వాళ్ళిద్దరికీ పెళ్లి చేసేస్తే జంట చాలా బాగుంటుంది కదూ" అంది శాంత. వారివైపు చూపుడువేలుతో చూపిస్తూ.

"ఇవ్వాళేనా!"

"బాగుంది. పెద్దవాళ్ళయ్యేక."

"అదా! నాన్నగారెప్పుడో చెప్పి పోయారు. మంజులను ఈ ఇంటి కోడల్ని చెయ్యమని."

"మీ నాన్నగారలా చెప్పారా!"

"అవును శాంతా. మా మామయ్య మంజుల పదినెలల పిల్లయి ఉండగా మరణిస్తూ మా అమ్మకు అప్పగించాడు. పుట్టగానే తల్లినీ, నెలల పిల్లయి ఉండగా తండ్రినీ పోగొట్టుకుంది మంజుల.

మాకు చెల్లెళ్ల లేరు. మా నాన్నగారికీ అమ్మకీకూడా అక్కచెల్లెళ్ల లేరు. మంజులంటే మా అందరికీ ప్రాణం. సంవత్సరం పైన అయింది మా నాన్నగారు పోయి. ఆయన పోతూ నాకు చెప్పారు. మోళీ మంజులా పెద్దవాళ్ళయ్యాక వాళ్లిద్దరికీ పెళ్లి చెయ్యి. మంజులను పరాయి ఇంటికి పంపించకు అంటూ. నాన్నగారు పోయినదగ్గరనుంచీ అమ్మ ఆరోగ్యం క్షీణిస్తూంది... ప్చ్.... చిన్నపిల్లని. ఏవో కమ్మని కలలు కంటూ అత్తవారింట్లో అడుగుపెట్టిన నీకి సొదంతా చెప్తున్నాను. చాలా రాత్రయింది నిద్రపోదాం" అన్నాడు మూర్తి.

"సొదా! మీరు చెప్పకపోతే నాకెలా తెలుస్తాయ్ ఈ సంగతులు!" నవ్వింది

చిన్నగా శాంత.

*          *

ఒకనెల తిరిగి వచ్చేసరికి నాలుగేళ్ళ మంజులా, ఎనిమిది సంవత్సరాల మౌళీ బాగా మాలిమి అయిపోయారు శాంత దగ్గర. అత్తగారిని వంటపనిలో కెళ్ళనివ్వ లేదు శాంత. మొదటి నాలుగైదురోజులు బిడియంగా తిరిగినా తర్వాత వదినా అని ఆప్యాయతగా పిలుస్తున్నాడు. మూర్తి కన్నా రెండేళ్లు మాత్రమే చిన్నఅయిన శంకరం.

మంజులను బ్రతిమిలాడి అన్నం తినిపించీ, మౌళికి తలదువ్వి, బట్టలిచ్చి స్కూలుకి పంపి.చీ, రామ్మూర్తి, శంకరం ఉద్యోగాలకెళ్ళే వేళకి కమ్మగా వండి పెట్టి, అత్తగారికి అణకువగా సేవలు చేస్తూ అందరి అభిమానాన్నీ చూరగొని, ఆ ఇంట్లో వ్యక్తులందరికీ ఆత్మీయురాలై పోయింది శాంత.

ఓ సంవత్సరం గడిచేసరికి రాజేశ్వరమ్మ ఆరోగ్యం కాస్త కుదుటపడింది. మంజుల పలకా బలపం తీసుకు స్కూలుకి వెళుతూంది. రాజేశ్వరమ్మ వంటపని చూస్తూండడంవల్ల మౌళీ, మంజులా ఇద్దర్కీ సాయంత్రం చదువుచెప్తూంది శాంత.

చిలిపిగా అల్లరిచేసే మౌళిని మృదువుగా మందలించి, మళ్ళీ "నా రాగిజుట్టు బాబు అందమైన బాబు కదూ! నా బంగారు తండ్రికి వదినమీద కోపం రాలేదు కదూ!" అంటూ అతని బుగ్గలు తలా ముద్దుపెట్టుకునేది శాంత.

"ఫో. ఎంగిలి చేసేశావ్" అంటూ ఆమె చీర చెరగుతో బుగ్గలు తుడిచేసుకునేవాడు మౌళి.

"మౌళి నా బుగ్గ కరిచేశాడు" అంటూ రిపోర్టువేసింది మంజుల. "పోనీ మొగ దేగా, నువ్వూ అతని బుగ్గ కరిచెయ్" అంటూ నవ్వింది శాంత.

తానూ నవ్వుతూ, "పోవే, నీ హాస్యం నువ్వూనూ, నిజంగా కరచేదేమో తల్లి వెధవ చూడు" అంది రాజేశ్వరమ్మ.

మంజుల కందిన బుగ్గను చూస్తూ "మౌళీ" గట్టిగా పిల్చింది శాంత.

"ఎందుకు వదినా!" అని వచ్చి "అన్నిటికీ నన్నే కోప్పడతావు. అదంతే అందరికీ ముద్దే .... కోతి .... కోతిలా గుంటావు అంటే మరేం చేస్తానేమిటి!" బుంగమూతి పెట్టాడు మౌళి

గలగలా నవ్వింది శాంత. "అలా అన్నావే మంజూ" అంటూ.

"కోతి...." అంటూ నాలిక బా మళ్ళీ మౌళివైపు చూస్తూ వెక్కిరించిం మంజుల.

"నిన్ను పెళ్ళి చేసుకోను పో" అన్నాడు మౌళి. రాజేశ్వరమ్మా, శాం నవ్వుకున్నారు వారి మాటలు వింటూ.

"అవుతారో కాదో కాని, వారిద్దరిలి భార్యాభర్తలమనే భావం నాటిపో స్తున్నావే శాంతా" అంది రాజేశ్వరమ్మ.

"అవకేం చేస్తారు. మా కోటికోతలు చాలా మంచిది. తప్పు. అలా కోతి అన వచ్చా బావని. మా బావ అందంగా కోరలా ఉంటాడు అనాలి. రా నూనె రాస్తాను" అంటూ ఎఱ్ఱగా కమిలిన బుగ్గకు నూనె రాస్తూ. మౌళీ తప్పు కదూ. ఇలా కరిచేస్తావా? ఈసారిలా చేశావంటే ఊరు కోను తెల్సా" అంది శాంత.

"దావిష్టమొచ్చినట్టూ వాగితే నేను ఊరుకోను" అన్నాడు మౌళి.

పసివాళ్ళను హాస్యంచేసిన మాటలు వారి హృదయాల్లో నాటి మొలకెత్తి మహావృక్షా లయిపోతాయని. అవి తా మెవ్వరూ పెకలించలేమనీ ఊహించలేని పెద్దలందరూ మౌళి భార్య మంజుల అంటున్నారు.

బొద్దుగా, తెల్లగా, అందంగా ఎదుగు తున్న మంజుల తనదనే భావం మౌళి హృదయంలో స్థిరపడింది. మౌళికి తాను కాబోయే భార్యనని అనుకుంటూంది మంజుల.

కాలం పరుగులు పెడ్తూంది.

* *

శంకరానికి సంబంధం చూసిపెట్టమని రమణయ్యగారిని అడిగాడు మూర్తి.

"ఎలాటి పిల్ల? కట్నం తెచ్చేదా? మంచి మనస్సు తెచ్చేదా?" అన్నాడు కను.

నవ్వాడు మూర్తి. "కట్నం తెచ్చే అమ్మాయిలందరికీ మంచి మనసు ఉండ దంటారా?" అని.

"భేషైన సంబంధం ఉంది. కొంపా గోడూ ఉన్నవాడివి కాబట్టి. ఎలా లేదన్నా నాలుగువేలిప్పిస్తాను. అమ్మాయి కాస్త ఛాయ తక్కువ ఏమంటావ్?" కళ్ళ జోడులోంచి చూశారు రమణయ్య మూర్తివైపు.

"తమ్ముడు వెళ్ళిచూస్తాడు. మంచి రోజు చెప్పి మీరే తీసుకెళ్ళండి. వాడు నచ్చుకుంటే నాకేం అభ్యంతరంలేదు" అన్నాడు మూర్తి.

నాలుగువేలు కట్నం. వెయ్యిరూపాయలు విలువచేసే సారె తెచ్చింది కాత్యాయని. కాని రెండునెలలు పూర్తి కాకుండానే ట్రాన్స్ఫరు ఆర్డర్లు తెచ్చుకున్న తమ్ముడివైపు ఆశ్చర్యంగా బాధగా చూశాడు మూర్తి.

"నే నెప్పుడో అనుకున్నాను వీడు ఉడాయించేస్తాడని. వెళ్ళనీ ఏం చేస్తాం. ఏదో తల్లిముందని బ్రతికున్న నాలుగు రోజులూ నా పిల్లలు నా దగ్గరుంటా రనుకున్నాను" అంటూ కంట తడిపెట్టు కుంది రాజేశ్వరమ్మ.

"ఎందుకమ్మా అలా బాధపడ్తావ్? రెక్కలు వచ్చిన పక్షి తల్లిరెక్కలో ఎన్నాళ్ళు ఉంటుంది? అయినా వేరుగా ఉంటే ఖర్చువెచ్చాలూ. బాధ్యతా తెలుస్తాయి. వెయ్యి ఏళ్ళకైనా వేరుకుండ తప్పదు అని నువ్వే అంటూంటావు?" అన్నాడు నవ్వుతూ మూర్తి.




"నిజమేరా బాబూ కాని....కుంక వేరవుతే, గుణం వేరవుతుందట. అయినా శాంతలాటిది కాదు కాత్యాయని."

రాజేశ్వరమ్మ మాట విని ఉలిక్కి పడింది శాంత. రెండునెలలు పూర్తిగా కాలేదు కాత్యాయని కాపరానికొచ్చి. ఈ రెండునెలల కాలంలో ఒకనెల పుట్టింటి తోనే ఉంది. ఇంతలో ఆమె అంతర్యం ఎలా కనిపెట్టేశారు అత్తయ్య! కాత్యాయని మనస్సు చిన్నది కావచ్చు కాని తన కొడుకు! తనకొడుకు నెందుకు నిందించరు! అయినా అతనికే అస్సలు అవవలసి ట్రాన్స్‌ఫరయితే, అతను ట్రాన్స్‌ఫరు చేయించుకున్నాడనీ కాత్యాయని, ఏమేమో చెప్పిందనీ, అబ్బ. ఎంత త్వరగా ఆలోచించి నిర్ణయానికొచ్చేశారు! అనుకుంటూ. "అత్తయ్యా పోన్లెండి. చిన్నపిల్లతాను. మరెవ్వరి దగ్గరా అనకండి అలా." అంటూ నవ్వింది శాంత.

"ఎవ్వరి దగ్గరంటాను! మన ఇంటికొచ్చాక అది మన పిల్లకాదూ! కాని ఓ ఏడాది పాటన్నా తోటి కోడళ్ళు ఇంట్లో కలసి మెలసి తిరిగితే బాగుండు ననుకున్నాను."

"మరి ఆ సంగతి అట్టే మనస్సులో పెట్టుకు బాధ పడకమ్మా. శంకరం ఖర్చుదారి మనిషి. నీకూ తెల్సు. వాడి డబ్బు ఇంటి ఖర్చులకోసం ఇవ్వడానికెలా బాధ పడ్డాడో. వాడి శ్రేయస్సు కోరేవారం అయితే. దానంతట అది అయిందో, లేక వీడు చేయించుకున్నాడో ట్రాన్స్‌ఫరు. వెళ్ళనీ. ఇల్లూ, సంసారం, బాధ్యతలూ తెలివివస్తాయి,

లపి ఉంది మనస్సులు నప్పకపోయి
ప్పుడు పోట్లాడుకుంటూ అలా బ్రతికే
న్నా విడిగా బ్రతుకుతూ కష్ట సుఖాల్లో
ఒకరికొకరం అనుకుంటూ ఉంటే అదే
దివేలు. నలుగురూ మెచ్చుకుంటారు.
గాడొచ్చాక మరేమీ అనకు.''

''శాంత మంచిపిల్ల. ఎందుకు పోట్లా
టలు వస్తాయి?'' మూర్తి మాటకు అడ్డు
స్తూ అంది రాజేశ్వరమ్మ.

''ఒకరు మంచివారైనంతమాత్రాన్న
పోట్లాటలు రావనేముంది! ఎవ్వరిపీ చెడ్డ
వారిని చెయ్యద్దు.''

''మనంచేసేదేమిటి? .... ఉన్న నెల
రోజులూ ముళ్ళమీద ఉన్నట్టు ఉంది
మవింట్లో. మావాళ్ళింట్లో కూర లిలా
వండరు. మాకిలాంటి అలవాట్లు లేవు.
అని మొహం కంట్రగించుకు కడుపు
నిండా అన్నం తినేది కాదు. ఎందుకు
వాయినా, ఏదన్నా అన భయం నువ్వూ.
మీ ఆవిడా నా నోరు నొక్కేస్తున్నారు''

''ఎందుకనాలమ్మా? మీ అమ్మ
మంచిది కాదు. నోరు పారేసుకుంటుంది
అంటే మేం ఎలా సహించాలి?....నీ
కెందుకు రామకృష్ణా అంటూ కాలం
గొర్లించేయ్. మనిషితోపాటు మనస్సూ.
నావికన్నా ఏపుగా స్వార్థం. అన్నీ ఎదిగి
పోతాయమ్మా. పాలుతాగే బిడ్డ నవ్వులోని
నిర్మలత్వం. పప్పూ అన్నంతినే పదేళ్ళ
వాడి నవ్వులో ఉండదు .... మరోలా
అనుకోకు. మొదట తల్లి చెప్పే మాటలు
పిల్లలు వినాలి. ఆ పిల్లలే ప్రాజ్ఞులై
ప్రపంచంలో బ్రతికేటప్పుడు ఆ పిల్లల
మాట తల్లి అంగీకరించాలి. మేమంతా
హాయిగా బ్రతకడమేగా నీకు కావాల్సింది
ఈ ట్రాన్స్ఫరు నిన్నూ నన్నూ బాధ
పెట్టినంతగా వాణ్ణి బాధించలేదు పైగా
సంతోషంగా ఉన్నాడు. బహుశా రెండు
మూడు రోజుల్లో కాత్యాయని వస్తుంది.
వారి కాపరానికి సరిపడా సామాన్లు
ఇంట్లోవి ఇచ్చెయ్యండి. మనకి ఇబ్బం
దంటే నెమ్మదిమీద ఆ కావాల్సిన
సామాన్లు మనమే కొనుక్కుందాం.
శాంతా! నువ్వూ అమ్మా కూడా ఆ
అమ్మాయినీ శంకరాన్నీ ఏమీ అనడానికి
వీల్లేదు. సంతోషంగా మంచిరోజు చూసి,
వాళ్ళతో నువ్వుకూడా వెళ్ళి కాపురం
పెట్టించెయ్.'' అన్నాడు మూర్తి ఆజ్ఞా
పిస్తూన్నట్టు. అతని గొంతు గంభీరంగా
ధ్వనించింది. ఆ గంభీరం చాటున ఏదో
సున్నితమైన బాధ.



కందిన బుగ్గలు తడుముకుంటూ
వెక్కి వెక్కి ఏడుస్తున్నాడు మోళీ.
'ఏం? ఎందుకు ఎవరు కొట్టారు?''
అంటూ మోళీ తల నిమిరి కన్నూ మొహం
తన చీర చెరగుతో తుడిచేస్తూ 'వయస్సు
వచ్చిన కొద్దీ కోపం లావైపోతూంది.
ఎందుకు కొట్టారు మీ అమ్మ? నువ్వేమి
అల్లరి చేశావ్. అయినా ఇంత గట్టిగా
కొట్టుకుంటూరా బుగ్గలెలా కంది

పోయాయ్." అసహనంగా బాధగా అంటూ మౌళిని దగ్గరగా తీసుకు ఓదారుస్తున్న శాంత మొహంలోకి చూస్తూ. "అమ్మకాదు" అన్నాడు మౌళి

తృప్తి పడింది శాంత. "మరెవరు కొట్టారు?" తన భర్త ఎప్పుడూ మౌళి మీద చెయ్యి చేసుకోడు. శంకరం ఊళ్లో లేడు. అనుకుంటూ, రోషంగా "మరెవరు కొట్టారు?" అడిగింది.

"ఆ రాక్షసి....చిన్న వదిన."

"ఎందుకు కొట్టింది?"

"మరేమో ఆవిడ జాకెట్ బాదిలో పారేసిందని దాన్ని బాదేసింది వదినా అమ్మ చూడకుండా, మంజు ఏడవకుండా గమ్మునఊరుకుంది. నేనేమో...." అంటూ జంకుగా శాంత మొహంలోకి చూశాడు.

"నువ్వేమిటి చేశావ్?" అతని జబ్బ పట్టి ఊపుతూ అడిగింది శాంత.

"తిట్టాను...."

"ఏమని?"

"నువ్వు రాక్షసిముండవి. అందుకే కొట్టావు. లేకపోతే మా మంజూనెవ్వరూ కొట్టరన్నాను వదినా .... లెంపలు వాయించేసింది."

"సరే అడుగుతానులే. కాని పెద్ద వాళ్ళని అలా తిట్టొచ్చా .... ఇంకెప్పుడు పెద్దవాళ్ళనలా తిట్టనని చెప్పి దేముడికి దణ్ణంపెట్టు" అంది శాంత.

అలా అంటూ దేముడికి దణ్ణం పెడుతూన్న మౌళి తల హృదయానికి హత్తుకుంది శాంత తృప్తిగా.

తర్వాత మంజులను పిలిచి, 'మంజూ అక్కయ్య జాకెట్ నువ్వెందుకు తీశావ్?' అని అడిగింది ఆ పిల్లవైపు జాలిగా చూస్తూ.

"చినుకులు పడ్తాయని, తాడుమీంచి కట్టతో లాగాను క్రింద పడిపోయిందక్కయ్యా...." అంటూ ఆగిపోయింది మంజుల.

రెండు చేతులతో మంజులను దగ్గరగా తీసుకుంటూ 'నిన్నేమన్నా కోప్పడిందా?' అడిగింది శాంత.

అంగీకార సూచకంగా తల ఊపింది మంజుల.

జంకూ, బిడియం లేకుండా పరాయి పిల్లల్నెలా దండిస్తారో బాబూ! అయినా అత్తయ్య అన్నమాటలు అక్షరాలా నిజం. కలిపి మెలిపి ఉండే తత్వం కాదు కాత్యాయనిది. ఇంట్లో అశాంతి రేగకుండా ఉండాలంటే వారు వేరు వెళ్ళడం ఎంతయినా మంచిది అనుకుంటూ బరువుగా నిట్టూర్చింది శాంత.

* *

శంకరం తన ఉద్యోగపు ఊర్లో కాపురం పెట్టాడు. కిమ్మనకుండా కాత్యాయని అవసరమని అడిగిన సామాన్లన్నీ ఇచ్చేసింది శాంత.

"శాంతా! అడిగినవన్నీ ఇచ్చేసుకుంటావా? వాడొక్కడేనా నా కడుపున పుట్టింది! మీ సంసారానికి కేమున్నాయ్.

లేవప్పుడట మాలికేమిస్తాం. ఇంట్లో ఇచ్చే ప్రతి పైసా లెఖ్ఖకడ్తాడే వాడు" అంటూ తీవ్రంగా. అసహనంగా మందలించింది రాజేశ్వరమ్మ.

"పోన్లెండత్తయ్యా.... రేపు మామిడి తోటమీద డబ్బు వస్తుందిగా, కొనుక్కుందాం" అని నవ్వేసింది శాంత.

"దానిలో వంతు అడగదా, నీ తోటి కోడలు."

"పోనీ ఇచ్చేద్దాం."

"మనకి మిగిలేదేమిటి?"

"అబ్బ ఊరుకొండత్తయ్యా. నలుగురు కొడుకులున్నాక, నాలుగు రకాల మనస్తత్వాలున్న కోడళ్ళు వస్తారు. మీరే మీ కొడుకుల్ని, కోడళ్లనీ అంటే, పైవాళ్ళనరూ.... మీ పురాణం స్నేహితురాళ్ళ దగ్గర మా చిన్నకోడలంటే అని ఏమీ చెప్పకండి. మీదగ్గర అలాగా అని చాటుగా రాజేశ్వరమ్మ తక్కువదేమిటి? అని నవ్వుకుంటారు. కోడళ్ళనే ఏమిటి? మీ ముగ్గురు కొడుకులదీ మూడురకాల మనస్తత్వం."

"నన్నే అంటావు కాని, దాని గడుస్తనం బాగులేదనవు" అంటూన్న రాజేశ్వరమ్మ "అబ్బబ్బ, ఇంకా విషయం వదిలేస్తారా, నన్నింట్లోంచి పొమ్మన్నారా" అని మూర్తి అరిచేసరికి మౌనంగా ఉండిపోయింది. నవ్వుకుంది శాంత.

తోట కాపు పట్టిందనగానే వచ్చాడు శంకరం. ఒక పూట ఉండి వెళ్లిపోతూ "తోట అమ్మేక డబ్బు పంపిస్తావు కదూ?" అన్నాడు మూర్తివైపు చూస్తూ.

"కాస్త డబ్బు జాగ్రత్తగా ఖర్చు చేస్తూండాలిరా తమ్ముడూ!" అన్నాడు మూర్తి.

"జాగ్రత్తగా కాలక్షేపం చేస్తున్నాం కాబట్టే అప్పులు చెయ్యవలసిన అవసరం పట్టలేదు.... క్రొత్త సంసారం కదా.... ఏవేవో కొనుక్కోవాలి నా మాష్టరు గిరీతో. టేబిలూ కుర్చీ ఇల్లాంటివి ఏం కొంటాను. తోట అమ్మగానే సంగోరు డబ్బు పంపించు."

అలా అంటూన్న తమ్ముడివైపు తేరిపార చూశాడు మూర్తి. చర్రున ఇవతలికొస్తూ, "ఏ భార్యని తెమ్మనరా.... టేబిళ్ళూ, కుర్చీలూ ఇక్కడమాత్రం ఉన్నాయా?" అంది రాజేశ్వరమ్మ ఉక్రోషంగా శంకరంవైపు చూస్తూ.

"అమ్మా!" మందలింపుగా అన్నాడు మూర్తి.

"శాను కట్టుబట్టలతో రాలేదమ్మా..." ఉదాశీనంగా అన్నాడు శంకరం.

ఇబ్బందిగా కదిలి కూర్చుంటూ, "అల్లాగే లేరా. అమ్మ మాటలకేమిటి" అన్నాడు మూర్తి.

(ఇంకా వుంది)

# శశిపోత్రచరిత

అరికపూడి (కొడాలి) కౌసల్యాదేవి

"మానవుడు చంద్రమండలంమీద విహరించి జండా ఎగరేసి వచ్చాడు" అన్నంతవరకు విశేషం బాగానే వుంది—బాగానే ఏమిటి—ఘనంగానే వుంది కాని ఆతడు తెచ్చిన వివరాలు మాత్రం ఏమీ ఆనందదాయకంగా లేవు నామటుకు నాకు.

చంద్రమండలాన్ని త్రవ్వి, ఇంత మట్టీ యిన్ని రాళ్లూకూడా మోసుకొచ్చాడు. చంద్రమండలంపై అతడు చూచినంత వరకూ అంతా రాయీ, రప్పా, మట్టీ! 'చంద్ర శిల!' అంటూ ఏదో పేద్ద పేరు పెట్టారు కానీ, ఏ రాయైతేనేం పళ్ళూడగొట్టుకోవడానికి?

చంద్రుడిని మానవుడు త్రవ్వి పారేస్తాంటే ఇహ అతడి మహిమేముంది? సూర్యచంద్రులు విష్ణుమూర్తియొక్క రెండు నేత్రాలూనట! శ్రీ లక్ష్మీదేవితో బాటు పాలసముద్రంలో పుట్టి ఆమెకు తమ్ముడైనందున, ఈ చంద్రుడు లోకమందరికీ చందమామ! ఇహ శృంగారానికా—ఈ చంద్రుడంతటివాడు లేనే లేడు! దక్ష ప్రజాపతియొక్క ఇరవై ఏడుగురు కుమార్తెలనూ పెళ్ళాడిన ఘనుడు ఆ తర్వాత వాళ్ళని సరిగా చూడక, దక్షుడి ఆగ్రహానికి గురై, శంకరుని శరణువేడి అతడి జటాఝూటంలో దాక్కొని, చావు దప్పి కన్ను లొట్టపోయినట్టుగా—నెలలో ఓ పక్షం రోజులు తరుగుతూ మరో పక్షంరోజులు పెరుగుతూ వస్తున్నాడు. అవే కృష్ణపక్షం, శుక్లపక్షం. చంద్రుడు పూర్తిగా మాయమైతే అమావాస్య. నిండుగా వున్ననాడు పున్నమి. ఇదంతా గాక గురుపత్ని 'తార' తోనే ప్రణయం సాగించిన సాహసి ఈ చంద్రుడు. ఇంత రసికుడు కావటం వల్లనేనేమో ప్రేయసీ ప్రియులకు అతగాడు అంత అపురూపంగా కన్పిస్తాడు!

ప్రేమికులకూ, క్రొత్త జంటలకూ అతి ప్రియమైనదీ, అపురూపమైనదీ పూర్ణిమ. కోరికలు రగిలించేవాడూ, ఆశలూరించేవాడూ, ఒక్కోతరి రాయబారం నడిపేవాడూ కూడ అందాల చందమామే ఒకప్పుడు అవతారపురుషుడైన రఘు

రాముడే ఏడ్చి మారాం చేశాడట చంద మామ కావాలని! ...అమ్మమ్మకై తేనేం, గురువర్యులకై తేనేం ఉగ్గుపాలతో రంగ రించి పోసి జీర్ణింపజేసిన పురాణాలు యివి హైందవులందరికీ.

మరి ఇవన్నీ ఇప్పుడసలు నిజమేనా అన్పించటం లేదూ? "ప్రేయసీ నీ నగు మోము చంద్రబింబమువలె నున్నది!" అంటే "ఓసీ, ఎంత ఫోజరు! నేను మట్టిముద్దలాగున్నానా?" అంటూ పళ్లు రాలగొట్టక పోతుందా ఏ ప్రియురాలు మాత్రం! ప్రాచీనమైన వాల్మీకి రామా యణంనుండి ఈనాటివరకూ ఎక్కడ చూచినా కవితలో చంద్రుని ప్రశంసే! అందానికి చంద్రుని మించిన ఉపమానం లేనేలేదు యింతవరకూ! కాని ఇప్పుడు! అంతా తలక్రిందులై పోయి మెదడు వేడెక్కిపోవటం లేదూ?

"మన మిరువురం .... తారాచంద్రు లం...." అనుకుంటూ ప్రేయసీప్రియులు యుగళగీతాలు పాడకొనే అవకాశం లేదింక! అసలు చంద్రుడే వట్టి—— ఏదో గ్రహం అంటూంటే ఇంక తార కోసం ఎక్కడ ఆలోచించేది!

అందుకే చంద్రునితో కలిసిన ఏ ప్రేమగీతం విన్నా వెనుకటంత సంతోషం ఇప్పుడు కలగటంలేదు.

ఇంతకూ చంద్రునితో ముఖ్యాను బంధం గల మన గొప్ప పండగ——పర్వ దినం వినాయక చవితిమాట ఏమిటి? వినాయకుని గుజ్జురూపం చూచి నవ్వినం దుకు చంద్రుడు పార్వతీదేవి శాపం పొందడం, ఆ చవితి చంద్రుని చూచిన శ్రీకృష్ణునికి అపవాదు రావడం ఇదంతా అబద్ధమేనా? చంద్రుడే అబద్ధమంటే ఈ పురాణాలూ అబద్ధమే ననుకోవాల్సిందేనా? ఈ చాంద్రా యణమంతా కల్పనేనా?

పాపభూయిష్ఠమైన ఈ లోకాన్ని చూడలేక శ్రీ వేంకటేశ్వరుడు శిలా రూపం ధరించాడన్నట్లుగానే ఈ పాపిష్టి లోకంలోని కర్మకాండలన్నీ చూడలేక చంద్రుడుకూడా రాయీ రప్పాగా మారి పోయాడా? లేక తార విషయంలోలాగానే ఏదైనా కొంటెపని చేస్తే కోపం వచ్చి సాంబశివుడు తన నెత్తిమీదినుంచి తొల గించి నేలకేసి కొట్టాడా ఈ చంద్రుణ్ణి? అటువంటిదేదో జరగకపోతే అంత అగ్రస్థానంనుంచి యింత అధమస్థానాని కెందుకు దిగజారిపోతాడని?

జ్యోతిశ్శాస్త్రంలోకూడ చంద్రునికి అతి ముఖ్యమైన స్థానం——ఇటు హైందవ శాస్త్రాలోనూ, అటు ఆంగ్లేయ శాస్త్రం లోనూ కూడ! పౌర్ణమి ముందు, అమా వాస్య తర్వాత —— అంటూ చంద్రుని పెరుగు తరుగులనుబట్టి మనం ఎన్నో పనులు చేయుటం ఆచారాయిం. చంద్రుని తరుగూ పెరుగులకూ, సముద్రపు ఆటు పోటులకూ ఎంతో సంబంధం. పౌర్ణమి రేయినాడు సముద్రం ఎగిరెగిరి పడుతుందని చెబుతాడువేమూ! పిచ్చివాళకూడా పౌర్ణమి







ముందు పట్టపగ్గాలు లేనంతగా వుంటాయి మరి! పిచ్చివాడిని lunatic అనడంలో గల అర్థం అదే. ఆకాశంలో వున్న మట్టి ముద్దకు ఈ మానవమేధపై ఇంత అధికారం ఏమిటో తెలియదు కదా!

పోనీ వట్టి మనుషులమేనా అంటే కాదే! పూలూ చెట్టుచేమలూకూడా ఆరాధిస్తున్నాయి ఈ చందమామని. అంత ఎత్తున ఆకసాన ఆ చంద్రుడుగారు కన్పించనిదే ఇక్కడ నేలమీద కలువ భామ వికసించదు; చంద్రకాంత హసించదు! మేంమాత్రం తీసిపోయామా ఉన్నట్టుగా పక్షులుకూడా ఉయాప: చక్రవాకం ఎవరెరుగనిది! చంద్ర చకోరానుబంధం ఎవరికి తెలియనిది! వెన్నెల పులుగు అనే నామాంతరం సంతరించుకున్నదికూడా అందుకే కదా!

"చంద్రుణ్ణి చూసొచ్చాను. చం మీద నడిచొచ్చాను" అంటూ దేశంవాడు ఎగిరెగిరి పడ్తే పడొచ్చ చంద్రుని చుట్టూ పరిభ్రమించే భార సుందర శృంగార కవితకుమాత్రం గొడ్డలిపెట్టు. ఈ ఘనవిజయం పై కవిహృదయాలకేమాత్రం సంతోష కాదు. అందానికీ ఆహ్లాదానికీ మా చంద్రుడనుకొంటూ "సుధాకర "సుధాంశుడు" "వెన్నెలరేడు" కీర్తిగానం చేస్తూ కావ్యసృష్టి చేసే కాశం శాశ్వతంగా దూరమైపో కదా! అసలు చంద్రుడు లేని కావ్యం వున్నాయా ఇంతవరకూ! ఏ మొఖం పెట్టుకొని సుందరమూ

ంద్రుడితో పోల్చగలం? విందుచంద్రుని గాస్తూ నాయికానాయకులు పాటలు పాడుంటూ గంతులు వేసే దృశ్యం చిత్రీకచటాని కిక ఏ సినీ డైరెక్టర్ మాత్రం హపించగలడు?

వెనుకటి రోజులలో నవల వ్రాయాచే చక్కటి కథాంశం. లిఖించేందుకువ సమయం. నామకరణం—ఇవి త్రమే సమస్యలుగా వుండేవి. ఇప్పుడు క్రొత్త సమస్య ఎదురైంది. చంద్రుని వర్ణించేది? ఏమి వ్రాయాలి? పోనీ లేద్దామా అంటే అదీ అంగీకారం దు. 'అతిలోకసుందరి—అతి సున్నిత రూపం—ఆహ్లాదకరమైన స్వభా...' అంటూ లక్షవర్ణనలు చేసినదాని పి. 'చంద్రునితో సరితూగు మోము' వల రేనినే కవ్వించగల సౌకుర్యం' అని ఒక్కవాక్యం వ్రాస్తే యేది. ఇప్పుడిక క్రొత్తగా ఏ గా వర్ణనలు చేసేది? మానసికంగా తిన్న ఈ పరిస్థితిలో ఈ చందమామ ఇటు పరిగ్రహించనూ లేక అటు పించనూ లేక అవస్థగా వుంది. ం కలం తీస్తే ముందు యిదే య తలెత్తుతోంది.

....పున్నమీ వెన్నెలలు పూల పుగా....'' అంటూ కమ్మనిగానం పరవశించే అవకాశం ఇంకెక్కడ పున్నమివెన్నెల కురిపించే ఆ చంద ను చూచి మనసులో ఇపుడు ఉల్లాసానికి బదులు కల్లోలం రేగుతూన్నది.

డాబామీద .... ఒంటరిగా .... విందు చంద్రుని చూస్తూ నిలబడిపోయి సర్వం మఱచిపోవటం నాకు అలవాటు. ఈనాడూ అలాగే నిలబడ్డాను.

''ఏమిటోయ్ అంత ఆలోచన! ఇక్కడ యింకా మనుషులం వున్నాం కాస్త మాట్లాడకూడదూ? .... సారీ, డిస్టర్బ్ చేశానా?''

నాకు నవ్వు వచ్చింది.

అన్నింటిలో ఏ మాటకూ బదులు పలుకలేదు.

అది ఎవరి ప్రవేశమైనా కావచ్చు: డిస్టర్బన్సే నిస్పందేహంగా. ఆలోచించేప్పుడు ఏకాంతాన్ని అభిలషిస్తాను.

''మమ్మీ .... డాడీ పిలుస్తుంటే .... మాట్లాడవేం?'' నేనూ ఉన్నానంటూ రెండేళ్ళ మాధవి అధికారం!

నేను మాట్లాడలేదు.

పరీక్షగా చూస్తున్నారనుకుంటా నన్ను, తండ్రీ కూతుళ్లు.

''ఏమిటంత దీక్షగా చూస్తున్నావు చంద్రుణ్ణి? మనం ఎప్పుడు వెళ్ళగలమా—ఏమున్నాయో చూచివద్దామా అనా?.... ఇన్ని విచిత్రాలు జరుగుతూండగా లేవిది—ఇక ఆ రోజులు మాత్రం రాకుండా వుంటాయా? చూద్దాం లే!''

''హతోస్మి! ఆఫీసులో రొటీన్ వర్క్‌కు అంకితమైపోయే ఈ మర మనుష్యులకు యింతకంటె వేరే కవిత్వం




ఎక్కడినుంచొస్తుంది?''

''మమ్మీ'' చేతులు చాపింది మాధవి.

దాన్ని యాంత్రికంగా అందుకున్నానే కాని నా దృష్టి చంద్రుని మీది నుండి మరల లేదు.

రెండు నిముషాలు నిశ్శబ్దం.

''మమ్మీ!'' ఎంతో మెల్లగా, మధురంగా పిలుస్తోంది మాధవి.

నేను పలుకలేదు.

షికారుకో పార్కుకో తీసుకుపొమ్మని చేరిందేమో! అంతకంటె పనేముంటుంది దానికి.

''ఇలా చూడు మమ్మీ!'' మళ్ళీ పిలుస్తూ నా రెండు చెంపలకూ తన చిన్నారి చేతులు ఆన్చి బలవంతంగా తన వేపు త్రిప్పుకుంది

''ఏమిటి?'' చీకాకు పడుతూ అడిగాను. పరిష్కారం లేని సమస్యతో నేను బాధపడ్తూంటే దీని అర్థం లేని గొడవ ఒకటీ మధ్యన!

''అటు చూడు మమ్మీ!'' చం[illegible] దెసగా చూపుడువేలుతో చూపుతో[illegible] ''ఆకాశం పెద్ద బొట్టు పెట్టుకుంది మమ్మీ!''

ఉలికిపడింది నామనస్సు.

నా పరధ్యానం పరుగులెత్తి పంచలైంచి.

''కదు మమ్మీ!'' రెట్టించింది మా[illegible]

పరీక్షగా చూచాను!

నిర్మల నీలాకాశం!

అపుడే ఉదయించిన నిండు చంద్రుడు!

పసిమి మిళితమైన అరుణ విరజిమ్ముతూన్న పూర్ణ బింబం!

ఇన్నాళ్లుగా నన్ను బాధిస్తూన్న సమస్యకు పరిష్కారం లభించినట్లయిం[illegible]



మాధవి పసిదైనా ఉపమానం
...గా. అందంగా చెప్పిందనిపించింది.
ఒక ప్రత్యేకమైన పరిధిలో, ఒక
...లో ఆలోచించడం అలవాటై పోయిన
తరం రచయిత్రీ రచయితల వల్ల
కవితలో క్రొత్త పోకడల నాశించడం
...వసరం. భవిష్యత్తులో ఈ పసివాళ్ళే
... భావాలు వెదజల్లాలి!

"నువ్వు పెట్టుకొనే బొట్టులాగే
... మమ్మీ!" మాధవి ఇంకా వత్తి
...వ్వింది.

"ఔనమ్మా! ఔను!" సంతోషంగా
పెట్టుకొన్నాను.

...న మాటలు విని, తన భావానికి
ఆమోదం వెలిబుచ్చడంతో మాధవికి
ఎక్కడలేని సంతోషం వచ్చింది.
కేరింతలు కొడ్తూ వెళ్ళిపోయింది ఆడు
కోవడానికి.

సమస్యకైతే ఏదో పరిష్కారం లభిం
చింది కాని, నా మనస్సుకు బాధోప
శమనం కలుగలేదు.

అతిగా మన్నన అందుతూ మేడి
పండులా బ్రతికే ఒక్కో ఉన్నతోద్యోగి
కడకు లంచాల కారణంగా పదవీచ్యుతు
డై విసర్జించ బడిన చందాన—అత్యు
త్తమమైన, అపురూపమైన, అసమాన
మైన కవితాపీఠం నుండి తొలగింప బడిన
ఓ చందమామా—నీకు నా సానుభూతి!



# ప్రతిద్వంద్వి

ముదిగొండ శివప్రసాద్

ఇది సత్యజిత్ రే బెంగాలీలో నిరుద్యోగ సమస్యమీద తీసిన సినిమా కథ అనుకునేరు—కాదు; గుంటూరు బ్రాడీపేట ఓవర్ బ్రిడ్జ్ దగ్గర జరిగిన ఓ అమ్మాయి కథ.

లక్ష్మి పెద్ద అందమైనది కాకపోయినా అనాకారిమాత్రం కాదు. ముఖ్యంగా ఆమె సౌజన్యం, సౌశీల్యం ఆమెకు పెట్టని ఆభరణాలుగా శోభించాయి. దానికితోడు కవులు ప్రబంధాల్లో వర్ణించేటట్లుండే ఆమె కళ్లు చూపరులను ఇట్టే సమ్మోహితులను చేసేవి. గుంటూరు బ్రాడీపేట నాలుగోలైనునుండి బయలుదేరి ఓవర్ బ్రిడ్జ్ మీదుగా దిగి తన కాలేజీకై వెళ్తుంటే రెండువైపులా నల్లకలు తోరణాలు కట్టినట్లుగానూ, తుమ్మెద బారులు తీర్చినట్లుగానూ, మరుని తూపులన్నీ చూపులరూపంలో చూపరుల ఉన్మత్తులను చేసేటట్లుగానూ వుందే అయితే మధుకరునికి సంపెంగల పై అసంభవమయినట్లే ఆమె సౌశీల్యం ఈ కల్హార మాలికలుకూడా ఎవ్వరి లోనూ పడలేదు. అలా పడలేదు అని సహజం తనదారిని తాను పోతే కథ అసలు జరిగేదే కాదు స్వ వరంలో రాజులు పంక్తులుకట్టి ఈ

వ్నట్లే స్టూడెంట్లు ఓవర్‌బ్రిడ్జి పైనా క్రిందా గజానికొకడు నిలబడి ఎప్పుడామె కటాక్షవీక్షణం తమలో ఏ అదృష్టవంతుడి మీద ప్రసరిస్తుందోనని అలా పరీక్షణలో తమ అమూల్యమైన కాలాన్ని వాళ్ళ తండ్రులు ఇంటినుండి పంపే డబ్బు కన్నా ఇంకా నిర్లక్ష్యంగా లెక్కాపత్రం లేకుండా ఖర్చుపెట్టేసేవారు. అయినాసరే ఆమె అలా తలవంచుకొనే కాలేజీకి పోయేది. అలా తలవంచుకొనే ఇంటికి చేరేది. దీనితో పిల్లలలో పంతం హెచ్చింది. వాళ్ళ పంతంతోబాటు ఈమె కాఠిన్యంకూడా రెట్టింపయింది.

లక్ష్మి తలవంచుకొని ఇంటినుండి యలుదేరేది. వాకిట్లోనే రెండు ఇకి ంపులు. మూడు సకిలింపులు. మరి లుగు అడుగులు వేశాక కిళ్లీకొట్టువద్ద లబడ్డ గొట్టాంపాటు కుర్రాడిపాట "చెలియా కనరావా!". గమ్యమెరిగిన థికునిలా లక్ష్మిమాత్రం అచంచలంగా శ్చయంగా ఎడంచేతో పుస్తకాలను హృదయానికి హత్తుకొని తనమార్గాన వంచుకొని సాగిపోయేది. ఇంతలో డీపేట మెయిన్‌రోడ్ - ఓవర్ బ్రిడ్జ్. శక్యంకానంత ట్రాఫిక్. గజానికొక ఏజ్ రోమియో. అయితే ఈ పద్మ హం అవలీలగా ఛేదించుకొని ముందుకు డం లక్ష్మికి వెన్నతోబెట్టిన విద్య. ర్యుడు ఉదయించడమన్నా ఆలస్యం దేమో కాని వాసు ఓవర్‌బ్రిడ్జ్‌వద్ద అటెండెన్సు వేసుకోవడం మాత్రం అన్ని ఋతువులలోనూ క్రమం తప్ప కుండా టంచన్‌గా చేసేవాడు. కోఠివ్వ వైద్యశాలవద్ద అదే సమయానికి రవి ప్రత్యక్షం. మరో యాభై గజాల కవతల దారితప్పిన ప్రయాణీకునిలా పోయిన వస్తువును వెతుక్కుంటున్నట్లు కాసేపు నేలనూ, మరి కాసేపు శూన్యాన్ని చూస్తూ తిరిగే జాన్—హిప్పీ స్టయిల్‌లో చెంపలు కిందిదాకా పెంచిన బక్కపలచని కుర్రాడు. అయితే లక్ష్మి సమానాంతర రేఖలమీద వెళ్ళేదే. క్షల్వపూల దండలు ఎంతవేస్తూ కాలేజీగేట్లవైపే చూస్తుండటంతో రోడ్ల పక్క పాంథులకు ఈ చూపుల ఒయ్యాసిస్సులు గగనకుసుమాలైనాయి. కుందేటి కొమ్ములైనాయి. అందని మ్రానిపండ్లయి నాయి.

లక్ష్మి, పద్మాక్షి ప్రాణ స్నేహితురాండ్రు. మంచీ చెడులు ఏకాంతంగా ముచ్చటించుకునేవారు.

పద్మాక్షి అనేది "అక్కా నీ కళ్ళు దేవుడు నాకిస్తే నా ఓహో—ఈ ప్రపంచాన్నంతా ఏకచ్ఛత్రాధిపత్యంతో ఏలేదాన్ని" అని.

లక్ష్మి నవ్వి "పిచ్చిపిల్లా—ఆడదానికి అంత అందం మంచిదికాదు కూడాను. అయినా నీ కళ్ళకుమాత్రం ఏంలోపం? కాస్త కాటుక పెట్టుకుంటే చాలు, కళకళలాడుతూ రంభలా వుంటావు."

"నువ్వు పొగడాల్సిందే నువ్వూ

చూడక్కా—నీ చూపులకోసం ఎన్నెన్ని నూతకాలు అలా పడిగాపులు కాస్తున్నాయో."

"అది నా దురదృష్టం. నేనేం ఉద్యోగాలు చేసి ఊళ్లేలబోవడం లేదు. బ్యూటీ కంటెస్టులలో పాల్గొనడమూ లేదు. పెళ్ళి ట్రెయినింగులో ఇదొక భాగమని మా వాళ్లు ఇంట్లో బలవంతం చేస్తే గత్యంతరం లేక ఒప్పేసుకున్నాను. లేకుంటే నాకీ కాలేజీ ముఖమే చూడాలని జీవితంలో కోరిక లేదు. ఏదో కాలక్షేపానికి ఇంట్లో పుస్తకాలు చదువుకుంటూ వంట చేస్తానే కాని—అక్బరు ఏ సంవత్సరంలో ఏ కోటను ముట్టడించాడూ. అబుల్ ఫజల్ వ్రాసిన జమాపద్దుల చిట్టాలో—ముట్టడిలో ఆదాయం ఎంత వుంది, వ్యయం ఎంత వుందీ, జంకిన్స్ చెవిని కోసినందుకు ఎన్ని సంవత్సరాలు తన్నుకుచచ్చారూ—ఈ వివరాలన్నీ నాకెందుకు పద్మాక్షీ—నేనేం హిస్టరీ లెక్చరర్ని కాబోవడం లేదు—పైగా ఇవి నా నిత్యజీవితావసరాలకు ఏ విధంగానూ తోడ్పడవు."

"నీవు బీ. సి. నాటి పిల్లవు అక్కా! బ్రహ్మదేవుడు పాత చింతకాయ పచ్చడి వంటి బూజుపట్టిన భావాలు కల నీవంటి వాళ్ళకు బ్రహ్మాండమైన సౌందర్యం ఇస్తాడు. ప్రోగ్రెసివ్ వ్యూస్ కల నావంటి వాళ్లకుమాత్రం న్యాయం చేకూర్చడు. సృష్టిలో ఇదొక వింత—ఏం చేస్తాం"

"పద్మా—అజ్ఞానంలో పడి టెంపరరీ ఎట్రాక్షన్స్‌కూ, సినిమాల ప్రభావానికి లోబడి ఇలా మాట్లాడుతున్నావు కా[illegible] ఈ బాధ పగవాడికూడా వద్దు. హాయిగ స్వేచ్ఛగా నా ఊపిరేదో నన్ను పీల్చుక పీయకుండా అంగరక్షకుల్లా నిరంతర[illegible] నన్ను అణువణువూ పరీక్షిస్తూ ఇల వెంటనంటుతుంటే ఎంత బాధ వేస్తుంద[illegible] తెలుసా? బాధను మించిన అసహ్యమ జుగుప్సాకూడా కలుగుతుంది. ప్రతిరోజ ఈ చదువు మానేసి ఇంట్లో కూర్చుం మని పొద్దునొకసారీ సాయంత్రం ఒ[illegible] సారీ అనుకుంటాను నేను. కాని తప్ప[illegible] కర్తవ్యం—గత్యంతరం లేదు. ఇ[illegible] అవస్థ పడవలసిందే. ఆ వచ్చే వరుడెవ[illegible] సెలెక్ట్ చేసుకోవాలంటే ఈ డిగ్రీకూ తోకలా వ్రేలాడుతుండాలట కదా! : నాన్న రోజూ పదిసార్లంటారీ మా నిజంగా ఆయనకెక్కడ గుండెపో వస్తుందో నావల్లనని, ఇలా నోరుమ కొని తల వంచుకొని చదువుల నాట ఆడేస్తున్నాను."

"కోతలు కొయ్యకోయ్. నా ద[illegible] కూడా ఎందుకు దాస్తావు నిజం. [illegible] ఇంతమందిని నీవు ఆకర్షించగలిగావ అది నీకు నిజంగా గర్వకారణం కా కాబట్టే ఊరుకున్నావు కాని లేకు వాళ్ళమీద ఎప్పుడో పోలీసు రిపోర్టు వుండేదానివి. నా వెంటనే కనుక వా[illegible] పడివుంటేనా ఓ ఆట పట్టించిన దాన్ని."

చూ వ

"బుద్ధిలేని పిల్లా—సినిమా డైలాగులు ల్లించకు. సినిమాలు వేరు. జీవితాలు వేరు. తెరమీదిదంతా నటన. ఇదంతా జీవితం. కఠోర సత్యం. నీవా మగపిల్ల ను ఆటపట్టిస్తావా? ఏం ఆట పట్టిస్తావే బతుక్కి. ఆకుమీద ముల్లుపడ్డా. ముల్లు ద ఆకుపడ్డా ఆకే చినిగిపోతుంది. ఆ లీసులుకూడా మనుషులే. మొన్న త్తగా వచ్చిన పోలీసాఫీసరు పగపట్టి ఎవ్‌టీజర్స్ నందరినీ అరెస్టు చేశాడు. ళుతో గొట్టాంపాంట్లను కోసి రోడ్డు ద నడిపించాడు. అలా చేయబడ్డ ళ్లలో ఓ పెద్ద రాజకీయనేత్తా ఓబిజినెస్ గ్నెట్, కొడుకుకూడా వున్నాడట. ఫలితం. పోలీసాయనకు ట్రాన్స్‌ఫర్. లా వున్నాయి పరిస్థితులు."

"పోనీ ఒక్కసారైనా నువ్వు మృదు గానైనా ఒక్కర్నీ మందలించినట్లు డలేదు నేను."

"అందుకని ఈ జాకర మొత్తమూ ఇష్టమని నిర్ణయానికి వచ్చావేమిటి? డ్వి—నీకు నిజంగా బ్రెన్ లేదు . మంత్రాలకు చింతకాయలు రాలవు. మందలింపులకూ, బెదిరింపులకూ లొంగి రారు. మొన్న బెజవాడ పత్రిక ఆఫీసు రోడ్‌న మా బంధువుల మ్మాయి కుసుమ పోతుంటే ఓ ఈవ్ ర్ వెంటపడ్డాట్ట. "నీకేం బుద్ధిలేదా— తల్లిలేదా? అక్కాచెల్లెళ్లు లేరా? అవి ననటంగా ఈపిల్ల రభస చేస్తే వాడు "లేకేం—అంతా వున్నారు పిల్లా— ఒక్క భార్యమాత్రమే లేదు" అని నలుగురూ గుమికూడే లోపల సైకిలెక్కి పారిపోయాడట. వెధవ సినిమా డైలాగులూ వాడూను. అందుకే తలవంచుకొని లేని ధైర్యసాహసాన్ని అనువుతెచ్చుకొని ఇలా కాలక్షేపం చేస్తున్నాను నేను పద్మా! ఎంత తల దువ్వుకోకుండా ఫ్యాషనబుల్ చీరెలు కట్టుకోకుండా. సంసార పక్షంలో పోతున్నా ఈ పోరు తప్పడంలేదు."

"ఆ మూడుముళ్ళయినా త్వరగా పడేటట్లు మీ నాయన్ను చెయ్యమను. మంగళసూత్రం చూస్తే ఈ పిల్లలకి తుపాకి గుండ్లని చూచినట్లవుతుంది."

"అఘోరించినట్లుంది నీ తెలివి — అదే అయితే ఇంక అసలు చదువెందుకే నాకు—దానికోసమే ఈ పాట్లన్నీ."

"పోనీ నేను కవచాను కట్టించుకో."

"నోరు మూసుకో. నీ జోక్స్‌కు హద్దూ పద్దూ లేకుండా పోతున్నాయి. జీవితం కథ కాదు. కఠోరసత్యం. ఇది గుర్తు పెట్టుకుంటే నీకీ పరాచికాలూ, వ్యామోహాలూ రెండూ వుండవు"

• •

కాలేజీలో స్టూడెంట్స్ యూనియన్ ఎన్నికలు.

అంతా ఎటుచూచినా కోలాహలమే.

ఓ ఎం. ఎల్. ఏ ఎలక్షనంత హడావుడి పెరిగింది. కరపత్రాలు గోడలపై వ్రాతలూ, కార్లతో ప్రచారాలూ అంతా

యు వ




రాజకీయ వాతావరణమే. అందులో ఒక గ్రూపు తమ రాజకీయాలకు అనుగుణంగా అందరు అభ్యర్థులనూ నియమించుకొని లాంగ్వేజి ఎసోసియేషన్ పోస్టుకు ఒక స్త్రీని నిలబెట్టాలని నిశ్చయించారు.

"ఎవరిని నిలబెట్టాలి?" ప్రశ్నించుకున్నారు వాళ్లు.

"ఇంకెవరిని. లక్ష్మిని నిలబెడితే సరి—ఆమె మనవెంట వుంటే చాలు. మొత్తం గ్రూపంతా గెలుస్తుంది. పిచ్చెక్కినట్లు వచ్చి ఓట్లేసి పోతారంతా మనకే"

అందరిదీ ఇదే అభిప్రాయం.

ఇంకేం వెళ్ళి ఆమెను ఒప్పిస్తే సరి

కాని ఒప్పుకుంటుందా??

ఏమో....

ఈ సదవకాశాన్ని ఉపయోగించుకునేందుకు ట్రిమ్‌గా తయారై బయలుదేరాడు వాసు.

లేడీస్ వెయిటింగ్ రూం ఇవతల కాచాడు.

క్లాసు కాగానే గదిలోకి వెళ్తూ కొంచెం దూరంనుంచే గమనించింది వాసును. ఇవ్వాళ వీడేదో సాహసానికి పూనుకున్నాడే అనుకున్నది.

"ఏమండీ...."

"ఆఁ—ఏమిటి?" జంకూ గొంకూ లేకుండా నిలబడి అడిగింది లక్ష్మి.

"మేం ఎలక్షన్లకు పోటీ చేస్తున్నాం"

"సరే—నా ఓటు మీకే ఇస్తాను."

లక్ష్మి వెళ్ళబోయింది.

'మేమంటే నేను కాదు — మా గ్రూపువాళ్లు. వాళ్లు మిమ్మల్ని కూడా లిటరరీ అసోసియేషన్‌కు అభ్యర్థిగా ఎంచు

కున్నారు."

"క్షమించండి. నాకిలాంటివి నచ్చవు."

"మీరట్లా అంటే మా గ్రూపంతా ఏం కావాలి?"

"మీ గ్రూపు ఏ గంగలోనన్నా దిగండి. నాకీ ఎలక్షన్లు వగైరాలు నచ్చవు. క్షమించండి" వెయిటింగ్ రూంలోకి వెళ్ళిపోయింది. మూడుముక్కల్లో సంభాషణ తేలిపోయింది.

వాసు యుద్ధంలో ఓడిపోయిన వీరుడిలా తిరుగుముఖం పట్టాడు.

చూస్తుండగానే పదిమంది జమకూడారు.

"ఏం మాట్లాడిందిరా వాసూ—మాకు చెప్పకూడదా?"

"ఒప్పుకుందా? మనతోబాటు కాన్వాసుకు వస్తానందా?"

ప్రశ్నల పరంపర—

"నువ్వదృష్టవంతుడివిరా — నీతో మాట్లాడింది."

అభినందనల వర్షం—

"అరేయ్—నన్ను చంపకండి—ఏ గంగలోనన్నా దూకమని తిట్టి పంపింది."

"అరే—అలా అన్నదా—అయితే ఇంకా అదృష్టవంతుడివి — ఆవిడచేత తిట్లు తిన్న మొదటి హీరోవు నీవు. ఇంకేం దూకు లక్కీ—సౌందర్య గంగలో—ఒకటే గోల.

•

"ఏమంటాడే వాడు?" పద్మాక్షి ప్రశ్న.

"ఆ—ఏవో వాడి మొఖం ఎలక్షన్సట — నిలబడాలిట — ఇదో నెపం పలకరించేందుకు" నిర్లక్ష్యంగా అన్నది లక్ష్మి.

"అసలు సంభాషణ ఏం జరిగింది?"

"పద్మాక్షీ—ఏం నీకు మతిపోతున్నది రోజు రోజుకూ. ఇలాంటి అల్పవిషయాలపై అంత ఫాసినేషన్ పనికిరాదు. ఎవ్వళ్ళో సవాలక్షగాళ్లు వస్తుంటారు, పోతుంటారు. కాని మన లక్ష్యమేమిటో అదే చూచుకోవాలి."

పద్మాక్షిమాత్రం లక్ష్మిని తమ మధ్య నిలబడ్డ ఓ 'హెలెన్ ఆఫ్ ట్రాయ్'లా భావించి చూస్తున్నది. ఈజిప్ట్ రాణి క్లియోపాత్రాలా అనుకొని మనస్సులోనే ఆరాధిస్తున్నది—

"ఏమిటే ఈ తన్మయత్వం."

"అక్కా — నీ అదృష్టానికి నేను అసూయపడుతున్నాను—నువ్వెంత అందమైనదానివి."

"మూర్ఖురాలా—అందం అశాశ్వతమైనది. శరీర సౌందర్యం ఏముంది? ఏ జబ్బు వచ్చినా నశించిపోవచ్చు."

"భగవద్గీత ఇంట్లో విని విని నాకు వంటబట్టినట్లుందక్కా. కాని చూడు నువ్వంటే ఎంత గ్లామరో—ఎట్రాక్షనో... నీకుకూడా మనసులో ఏ మూలో ఆనందం వుండే తీరాలి ఈ ఘనతకు.

"అందుకే నిన్ను నేను స్టుపిడ్ అంటున్నది—ఈ వందిమాగధుల కైవారాల సంకెళ్ళనుండి విముక్తి ఎప్పుడా అవి భావిస్తుంటే నా కిది ఆనందమా?"

"కాకుంటే ప్రిన్సిపాల్‌కు ఒక్కరి మీదనన్నా ఎందుకు రిపోర్ట్ చేయలేదు."

"ఆయనది రెండువైపులా వాడిగల కత్తి. అటు అబ్బాయిలను సస్పెండు చేయడంతోబాటు బికినీ పెరేడ్‌లా ఏమిటీ వేషాలు? ఇది కాలేజీ అనుకున్నారా? బ్యూటీ కాంపిటీషన్‌లో పాల్గొనేందుకు వచ్చారనుకున్నారా?" అని ఈ గుర్రపు జూళ్ల కన్నిటికీ ఫైన్ వేస్తాడు—రచ్చకెక్కడం ఎవరికిమాత్ర మేమంత ఆనంద కరమైన విషయం."

కొద్దిరోజుల్లోనే ఎలక్షన్లకు అభ్యర్థులు నిలబడ్డారు. ప్రెసిడెంట్, వైస్ ప్రెసిడెంట్, సెక్రెటరీ, జాయింట్ సెక్రెటరీ, ఆర్ట్ రిప్రెజెంటేటివ్, లాంగ్వేజ్ రిప్రెజెంటేటివ్. గేమ్స్ సెక్రెటరీ, క్లాస్ రిప్రెజెంటేటివ్—మొత్తం ఎనిమిది ఓట్లు—నాలుగు గ్రూపులు — ఇండిపెండెంట్లతో కూడా కలిపి మొత్తం నలభై మంది అభ్యర్థులు. ఒక్కొక్క అభ్యర్థికీ ఇరవై మంది వందిమాగధులు.

అంతా లక్ష్మి చుట్టూ ప్రదక్షిణం చేశారు.

తడవ కొక డొక కరపత్రం తీసుకొని లక్ష్మి కందించి "మీ ఓటు మాకే వేస్తారు కదూ—షూర్‌గా—" ఇలా ఏదో మాట్లాడానన్న సంతృప్తితో వెళ్ళేవాడు.

వీళ్ళ వెర్రి మొర్రి వేషాలు చూచి అసహ్యించుకొని ఈ కరపత్రాల సన్నిటినీ ఇంట్లో వాళ్ళ బాబాయి షేవింగ్ సబ్బు తుడుచుకునేందుకు పడేసింది.

కొద్దిరోజుల్లో ఎలక్షన్లయినాయి.

పోలింగుకుకూడా వెళ్ళలేదు లక్ష్మి.

ఎవరో కొందరు గెలిచారు. కొందరు ఓడారు.

ఈ జాతరమాత్రం ముగిసింది.

పీడ వదిలిపోయింది అనుకుంది లక్ష్మి.

మళ్ళీ ఆమె కాలేజీ ప్రయాణం ప్రారంభం.

మళ్లీ "చెలియా కనరావా" పాట.

మళ్ళీ ఓవర్‌బ్రిడ్జ్‌వద్ద వాసు అటెండెన్స్.

ఆర్య జోజప్ప వైద్యశాల ముందు రవి.

అలాగే శూన్యాన్ని చూస్తూ చెంపలు పెంచుకున్న జాన్.

అంతా మామూలే.

*　*

ఇలా వుండగా కాలేజీలో ఓ విచిత్రం జరిగింది.

కలకత్తాలోని ఆందోళనల కారణంగా పలుకుబడి కల చాలామంది సెంట్రల్ గవర్నమెంట్ ఉద్యోగులు వివిధ ప్రాంతాలకు ట్రాన్స్‌ఫర్ చేయించుకున్నారు.

అలా వచ్చినవారిలో ముకల్ బెనర్జీ ఒకడు. ఆయన చాలాకాలం విజయ వాడలో పనిచేసి ప్రమోషన్ మీద కలకత్తా వెళ్లాడు. అక్కడి అవ్యవస్థవల్ల తిరిగి ఆంధ్రప్రదేశ్‌కు పంపమని కోరాడు. వెం వాళ్లు అంగీకరించారు. తెచ్చి గుంటూరులో పోస్టు చేశారు.

రాగానే కుమార్తె సురేఖను కాలేజీలో చేర్పించాలని ప్రిన్స్‌పాల్‌కు ఫోన్ చేశాడు.

"ఒహో — బెనర్జీ సాబ్ — మళ్లీ వచ్చేశారేమిటి! మీరు మా ప్రాంతానికి ఇదివరకే చాలా పాత పరిచయం వుంది."

"అవునండీ — అమ్మాయికి సీటు కావాలి"

"ఓ యస్. ఖాళీలున్నాయి పంపండి ట్రాన్స్‌ఫర్ సర్టిఫికెట్లు వగైరాలతో."

కార్లో తెచ్చి డ్రాప్ చేసి వెళ్ళిపోయాడు కూతుర్ని.

సురేఖ కాలేజీలో చేరింది!

కాలేజీ మొత్తం విద్యుత్తాడనం, ఎలక్ట్రిక్ షాక్‌తో కంపించినట్లు చలించి పోయింది.

సురేఖ నిజంగా అందగత్తెల జాబితాలోనే చేరింది. కలకత్తా జామకాయలాంటి రంగు, కావ్యాల్లో వర్ణించేటట్లుండే సంపెంగ పువ్వువంటి నాసిక, విదియ చంద్రునివంటి నుదురూ, శ్రీకారం చుట్టినట్లున్న చెవులూ, తుమ్మెదల్లాంటి ముంగురులూ, అస్తినాస్తి విచికిత్సతో కన్పడే కటీ, చిగురుటాకుల్లాంటి చేతులూ, అరటి బోదెలవంటి ఊరువులూ, కృష్ణా పులిన తలాలవంటి నితంబాలూ, హంసలవంటి నడక, చిలకలవంటి పలుకులూ, అలంకార సామగ్రి మొత్తం ఒకచోట కుప్ప పోసినట్లూ, కవుల లక్షణాలన్నిటికీ లక్ష్యమన్నట్లూ క్షణికం కాని విద్యుల్లతలా మెరుస్తుంది సురేఖా బెనర్జీ.

సౌందర్యం భాష అయితే ఈమె బాలవ్యాకరణం.

సౌందర్యం భావమయితే ఈమె శబ్ద రత్నాకరం.

సౌందర్యం వసుచరిత్ర అయితే ఈమె సరస భూపాలీయం.

సౌందర్యం ఒక మహాకావ్యమయితే ఈమె ధ్వన్యాలోకం.

సురేఖా బెనర్జీ ఒక లక్షణం—ఆమే ఒక లక్ష్యం!!

రోజూ ఆఫీసుకెళ్తూ ముకుల్‌జీ కూతురును కారులో కాలేజీవద్ద డ్రాప్ చేసి వెళ్లేవాడు. వచ్చేటప్పుడు మాత్రం స్నేహితురాండ్రతో కబుర్లు చెప్పుకుంటూ ఇంటికి పోయేది సురేఖా బెనర్జీ!

ముకుల్‌జీ బ్రహ్మో; సురేఖకుకూడా ప్రార్థనా సమాజంతోనూ, సాంఘికోత్సవాలతోనూ బాగా పరిచయమే. అందుకనేమో చూస్తుండగానే తీగెలా అల్లుకుపోయింది మిత్రులతో. కలకత్తా సోషల్ లైఫ్ ముందు సురేఖకు గుంటూరు సముద్రం ముందు కాలువలా కన్పించింది. ఎవరే పార్టీకి పిలిచినా సురేఖా




పార్టీ సిద్ధం. ఎవరూ పిలవకపోతే వాళ్లింట్లోనే పార్టీలు ఏర్పాటుచేసేది. కాలేజీలో గర్ల్ ఫ్రండ్స్‌తోబాటు బాయ్ ఫ్రండ్స్‌కూడా ఉత్సాహంగా పాల్గొనేవారు పార్టీలల్లో. వీటితోబాటు చిన్న చిన్న పిక్నిక్స్. సినిమా ప్రోగ్రామ్ — ఓహ్! గుంటూరుకు మినియేచర్ 'ఓహ్ కల్కటా' స్థాయి వచ్చేసింది.

ఇప్పుడు లక్ష్మి బయలుదేరగానే 'చెలియా కనరావా' వినిపించడం మానివేసింది. లక్ష్మి థియేటర్‌వద్ద బీట్ కానిస్టేబుల్ వాసు అదృశ్యం. జోజప్ప వైద్య కళాశాల దగ్గర రవి కనపడటం మానేశాడు. అవతల శూన్యంలోకి చూచే హిప్పీ జాన్‌కూడా పత్తాలేడు. ఇప్పుడిక లక్ష్మి ఆనందాన్ని వర్ణించేందుకే భాషా చాలదు.

ఒక్కసారి శృంఖలాలనుండి బయట రామచిలుకలా హాయిగా స్వేచ్ఛా వా వులను పీల్చింది. 'పీడ వదిలిపోయి పద్మాక్షీ' అని తన సంతోషాన్ని వ్య చేసింది పద్మతో. తన కిక ఈ అ రక్షకుల కాపలా తీరిపోయిందన్న మా ఆ సురేఖ నెత్తిన పాలు పోద్దామనపించి లక్ష్మికి.

లక్ష్మి మొదటినుంచి చాలా ము సరిగా మాట్లాడేది. అందుకనే సురేఖ వెంటనే స్నేహం కలుపలేకపోయిం నిజానికామె కంత అవసరంకూడా పోయింది. సురేఖమాత్రం కన్పడ్డ ప్ర వారినీ పలకరించేది. లక్ష్మినికూ 'హలో' అంటూ నవుగుదికోబాచే రెం మూడు సార్లు విష్‌చేసింది కూడా

సురేఖలో ఏదో వశీకరణ శక్తి వుంది.
ఇట్టే స్నేహితులను ఆకర్షించి తన వెనుక
ఐది తిరిగేటట్లు చేసుకోగలిగేది. ఒక్క
ాక్ష్మి తప్ప తక్కినవారంతా ఆమెకు
ంందిమాగధులే. ఆమె రూపమే వేరు.
ఆమె కారే వేరు. ఆ స్టేటసే వేరు

కాలేజీలో కల్చరల్ డెలిగేషన్‌కు సెలక్షన్స్ వచ్చాయి. పేర్లు ఇవ్వవలసిం ని కోరారు. చాలామంది తమ పేర్లి ్చారు. కాని దాదాపు ఏకగ్రీవంగా ందరూ తమ టీమ్‌కు సురేఖా బెనర్జీ ాయకత్వం వహించాలని కోరారు. క్ష్మికి వాళ్ళ వెర్రిని చూచి ఏడ్వాలో. వ్వాలో తోచలేదు పూర్వమయితే లాంటి అవకాశమేదైనా వస్తే చాలు ొగల్లా ముపిరేవారు ఫాన్స్. ఏదో ఒక ంక పెట్టుకొనివచ్చి తనతో మాట్లాడి ావడానికి పరితపించేవారు. తాను నిర్ల ్యంగా కసిరేది. అయినాసరే వాళ్ళు న్నబుచ్చుకొనకుండా 'అదే మహా ్సాద' మన్నట్లు స్వీకరించి పోయేవాళ్లు. ని నేడు....ఎంత తేడా! ఎంత హాయి!! ు పేరును ప్రతిపాదించినవాడూ లేడు. మ్న రమ్మని పిలిచిన దుర్మార్గుడూ ు.

ఆరోజు మామూలుగానే కాలేజీకి తున్నది. బ్రిడ్జిదగ్గర వాసు వెళ్తూ ్ంచాడు. తన్ను చూడగానే ఏ పిపం ి. పెద్దపులినో చూచినట్లు భయపడి చుమించు పరుగెత్తినట్లు నడుచు కుంటూ వెళ్ళిపోయాడు. పారిపోతే వాసును ఏడిపించాలనీ పరాచికమాడాలని అనిపించింది లక్ష్మికి. ఈ విషయం పద్మతో చెప్పాలని కాలేజికి పోగానే చూచింది స్నేహితురాలి కోసం. కాని పద్మ కనపడలేదు. కాలేజీకూడా చాలా డల్‌గా, కలర్‌లెస్‌గా వుంది. సాయం త్రానికి పద్మ కనపడింది.

హడావుడిగా "ఏమిటీ అబ్బాయిల్లాగా నువ్వూ కొంపదీసి కాలేజీ మానుకొని ఏ మార్నింగ్ షోకో చెక్కెయ్యలేదు కదా."

"లేదే. ఇవ్వాళ రాజా రామ్మోహన్ రాయ్ జన్మ తిథి. అందుకని సురేఖా గారింట్లో పార్టీకి వెళ్లాను. ఓహ్! నిజంగా ఏం ఉత్సాహం, ఏం తన్మయం."

పద్మకూడా సురేఖా వలయంలో తిర గడం లక్ష్మి ఎన్నడూ ఊహించనేలేదు.

పద్మ అలా జన్మతిథి విశేషాలు వర్ణిం చుకు పోతున్నది. వేడుకలను స్వభావో క్తులతో, అతిశయోక్తులతో వివరిస్తూ వున్నది. లక్ష్మి కాసేపు విని విసుగు దలతో "ఎంత సేపూ ఈ సురేఖా మాహాత్మ్యమేనా? వేరే కబుర్లేమైనా వున్నాయా."

"కాదే లక్ష్మి. చెపితే నీ కాశ్చర్యంగా వుంటుందేమో కాని, ఓహ్! అసలా కల్చరే వేరనుకో. ఆ భక్తి. ఆ తాదా త్మ్యం, ఆ సోషల్ గాదరింగూ — లక్ష్మీ నువ్వూ అనుభవించాల్సిందే కాని నేను వర్ణిస్తే లాభంలేదు.'

యువ.

లక్ష్మికి చికాకు క్షణక్షణానికి పెరుగుతున్నది. పద్మమాత్రం ఇదేమీ గమనించకుండా వెర్రిముఖం వేసుకొని సురేఖ ఘనతను వర్ణిస్తోంది. "మన కాలేజీ పిల్లలే కాదు. కలెక్టరుగారూ, పెద్దపెద్ద ఆఫీసర్లూ ఎంతమంది వచ్చిపోయారో పొద్దుటినుంచీ సాయంత్రందాకా — నీ కసలు బొత్తిగా తెలియనే తెలియదా లక్ష్మీ?"

"ఉహూఁ."

"అవునులే. పాత చింతకాయ పచ్చడిలా నువ్వే మూలనో నక్కివుంటావు. లేకుంటే సురేఖ నీకూ తప్పకుండా ఇన్విటేషను ఇచ్చేవుండేది—ఆమె హృదయం ఎంతో విశాలం లక్ష్మీ."

లక్ష్మికి పద్మను చెప్పుతో తన్నాలనిపించింది.

విదిలించుకొని లేచి నిలబడి "చాల్లే నోరు మూసుకో—ఈ బోరు కట్టిపెట్టు."

"కాదే లక్ష్మీ—నీ పాత అంగరక్షకులు లేరూ వాసూ, రవీ, జానూ వాళ్ళంతా అక్కడ పార్టీలో వాటర్ సప్లయ్ చేస్తున్నారు అతిధులకి—ఆ జానుగాడి అవస్థయితే రాను రానూ వర్ణించలేననుకో. ఏదో పారేసుకున్నట్లు పరుగెత్తుతూ, గెంతుతూ నౌకరీ చేశాడు. అయితే ఎవ్వరూ దాన్ని నౌకరీగా భావించ లేదు. ఉత్తమ సంస్కారంగా, సంఘసేవగా భావించారు."

లక్ష్మి నీలోత్పలాలు అరుణ కమలాలుగా మారాయి.

"పద్మా. మన పేస్మీ బాగాలేదు. ఏదైనా సినిమాకెళ్దామా?" లక్ష్మికి సినిమాకెళ్లాలనే కోరిక కలగడం ఇదే మొదటిసారి.

"సారీ మాడమ్—ఈ రాత్రికి సురేఖ గారింట్లో సభ వుంది. చాలా పెద్దపెద్ద వాళ్లు వచ్చి మాట్లాడుతారట. నన్ను తప్పకుండా రమ్మని ప్రామిస్ చేయించుకుంది. చేతిలో చెయ్యి వేసి వచ్చానుకూడా. క్షమించు లక్ష్మీ మరోరోజు వెళ్దాంలే." పద్మ చకచకా వెళ్లిపోయింది ముంజేతి వాచీ చూచుకుంటూ.

లక్ష్మి నిర్ఘాంతపోయి చూస్తున్నది పద్మపోయిన వైపుకే.

ఆ రాత్రి లక్ష్మికి నిద్రపట్టలేదు. సమాజం ఎందుకిలా వ్యామోహాలవెంట పరుగెత్తుతున్నది?? చాలాసేపు ఆలోచించింది. అంతుబట్టలేదు. తనలో ఏదో చెప్పలేని బాధ.

అదీ ఇదీ అని నిర్వచించలేని వేదన.

తనకూ తన కళ్ళకూ ఏమయింది??

తనలోని ఆకర్షణాశక్తి నశించిపోయిందా??

నమ్మ బుద్ధి కాలేదు.

ఒకరాత్రప్పుడు అద్దంలో కళ్ళు చూసుకున్నది. అవి వెనుకటిలా స్వచ్ఛంగా కనపడలేదు. ఎర్రగా పచ్చగా రంగులు రంగులుగా కనపడ్డాయి. భయంవేసి కళ్లు మూసుకొని పడుకున్నది. కలల్లో ఏవేవో వింత వింత జంతువుల విలయనృత్యాలు.

అశాంతి—ఆరాటం.

మర్నాడు ఉదయమే కళ్ల డాక్టరు దగ్గరి కెళ్లింది.

ఆ:లిగొన్న తోదేలులా కూర్చొని వున్నాడు. బి. బి. పి. రావ్. "రా అమ్మా. లోపలికి రా. కూర్చో. ఏదీ ఆ బోర్డు చదువు." రాగానే అక్షరాల ఛార్టు ముందు కూర్చోబెట్టాడు. నిద్రలేమితో అస్తవ్యస్థంగా చదివింది లక్ష్మి.

"ఏదీ మొదటి రెండు పంక్తులూ మళ్లీ చదువు."

చదివింది లక్ష్మి. ఇదేమిటి తనకీ పరీక్ష? తన కళ్ళ మెరుపుకోసం ప్రత్యేక చికిత్సలూ. చిట్కాలూ చెప్తాడేమోనని వెళ్ళిందసలు లక్ష్మి.

"చూడమ్మాయ్—నీవు తొందరగానే మేలుకున్నావు. ఫరవాలేదు. ట్రీట్ చేస్తానులే."

"థేంక్సుసార్" ఆశ్చర్యపోతూ అడిగింది లక్ష్మి—

రావు ఏదో మూడు పంక్తులున్న పేరు చెప్పాడు. అదొక జబ్బు పేరట జబ్బు కన్నా పేరే భయంకరంగా వుంది—

లక్ష్మి శూన్యంలోకి చూస్తున్నది మతి పోయినదానిలా

తనకి కళ్ళ జబ్బేమిటి? ఎవరన్నా వింటే నవ్వుతారు—కాని రావు వ్యవహారం చూస్తుంటే నమ్మక తప్పేట్లు లేదు.

"జోడు రేపు తీసుకుపో అమ్మాయ్. ఫరవాలేదులే—పో"

ఫీజు బిల్లు తయారుచేసి అందించాడు. బిల్లుతో సహా ఇల్లు చేరింది కాళ్ళీడ్చుకుంటూ—

తండ్రి ఏమీ అవలేదు—

తల్లి విసుక్కుంది—

మూలనున్న నాయనమ్మ అన్నది "అవేం మాయదారి జబ్బులో—ఇప్పుడందరికీ జోళ్ళే—వాళ్ళ చదువుల చల్లగుండా—మా రోజుల్లో అయితే శుబ్బరంగా తవుడూ నెయ్యీ తిని బతికేవాళ్ళం. ఏ జబ్బులూ వుండేవి కావు—ఇప్పుడో? ఏం నూనెలో నమ్మా మాయిదారి నూనెలు—అసలీ చదువులేమిటి ఇరవైనాలుగ్గంటలూ అన్నం ముందు కూడా పుస్తకాలు పట్టుకొని కూర్చోడం—మా కాలంలో ఎరుగుదురా ఎవరన్నా?"

లక్ష్మికి దుఃఖం వచ్చింది—తానేం పశువా తవుడు తినడానికి—బియ్యంపైన విటమిన్లు లేకపోతే అది తన దోషమా??

అయినా తనకు కళ్ళ జబ్బా—??

అసంభవం. అబద్ధం—

మర్నాడు తండ్రే వెళ్ళి బిల్లు పే చేసి జోడు తెచ్చియిచ్చాడు లక్ష్మికి.



కాలేజీలో ఎలక్యూషన్ కాంపిటీషన్.

సెక్రెటరీ—పోటీ వివరాలు అందరికీ వివరిస్తున్నాడు—

పద్మ చెప్పింది "సురేఖ పాల్గొంటున్నదట ఇంగ్లీషు డిబేట్‌లో — పస్ట్




పాల్గొంటే ఎంత బాగుండును లక్ష్మీ—''

''అవును పద్మా—ఆ రవిని పిలువు—నేనూ పాల్గొంటాను—''

పద్మ వింతగాచూస్తోంది లక్ష్మి వైపు.

రవి వచ్చాడు—

కాని ఇతడు మునపటి రవి కాదు—

అతనికి ఏ కలువ పూలపందల కోసమూ నిరీక్షణ లేదు. ఎవరినీ ప్రసన్నం చేసుకోవాలన్న కోరికా లేదు.

వచ్చాడు భయం భయంగా, బిక్కు బిక్కు మంటూ—

''ఏం మిస్టర్ పెద్దపులిని చూచినట్లు ఎందుకలా భయపడతావ్—'' నవ్వుతూ అంది లక్ష్మి—

లక్ష్మి జీవితంలో కాలేజీలో నవ్వడం అదే మొదటి సారి. అయినా సరే ఆ నవ్వు రవికి భయదాయకంగానే వుంది.

లక్ష్మి సంగతి ఎవరికి తెలియదు:

తన పేరిచ్చింది డిబేటింగ్‌లో పాల్గొనేందుకు—అంతే పేరు రాసుకొని తిరిగి వెనక్కు కూడా చూడకుండా పోయాడు రవి.

''ఇప్పుడే వస్తాను లక్ష్మీ—'' పద్మ వెళ్ళి పోయింది.

ఆమె ఎక్కడికి పోతుందో లక్ష్మికి తెలుసు.

అయినా సరే పద్మను ఆపే శక్తి లక్ష్మికి. రెండు కళ్ళు లేవు నాలుగు కళ్ళున్నా సరే ఇప్పుడు లేదు.

డిబేటింగు పోటీ జరిగింది కొద్ది

రోజుల్లోనే. లక్ష్మికి ఇంగ్లీషుమీద మంచి కమాండ్ వుంది.

ముందు సురేఖాబెనర్జీ మాట్లాడింది. భాష, భావం పెద్ద బాగాలేకపోనా ఆక్సెంట్ (ఉచ్చారణ) లో మంచి స్టైల్ మైన్‌టైన్ చేసింది—ఆమె ప్రతివాక్యానికీ కరతాళ ధ్వనులే—ఉత్సాహ సూచకమైన శబ్దాలే.

హాలంతా పున్నమి చంద్రుణ్ణి చూచిన సముద్రంలా ఉప్పొంగింది.

ప్రసంగిస్తూ ఒక్కసారి జఘనాలను స్పృశిస్తున్న పొడవైన తుమ్మెద బారు వంటి ఆ జడను ముందుకు వేసుకొని బల్లగుద్ది గట్టిగా ఒక పాయింట్ చెప్పింది.

సత్యభామ కన్పడింది కొందరికి

శశిరేఖ కన్పడింది మరికొందరికి.

శర్మిలా టాగూర్‌ను చూచారు మరి కొందరు.

ఆరేషన్‌లో ఆంగిక ప్రదర్శనకు మార్కులు పడవు—అదొక అవలక్షణం అని లక్ష్మికి తెలుసు—అయినా సరే ఈ గుంపుకు అదంతా ఎందుకు??

లక్ష్మి అసహ్యించుకుంది వీళ్ళ ప్రవర్తనకు.

ఈ చప్పట్లు ఆమె చెవుల్లో సీసం కరిగించి పోసినట్టు అనిపించింది'

తర్వాత ఒకరిద్దరు ప్రసంగించారు—

''మిస్ లక్ష్మి'' పిలిచారు.

లక్ష్మి లేచింది—సభలో ఆశ్చర్యం!!

వచ్చి డయాస్‌పై వినమ్రంగా నిల బడి చేతులను నిటారుగా పెట్టుకొని తల కదిలించకుండా ఆరేషన్ ప్రారంభించింది.

''చతుర్నేత్రి'' వెనుకనుండే ఎవరిదో కేక. పక్కన నవ్వారంతా.

ముందు వరుసలో పెద్దలు మాత్రం కోపంతో చూచారు వెనుక్కు తిరిగి— ఎవరన్నారో ఎలా తెలుస్తుంది??

అధ్యక్షుడు ''సైలెన్సు'' అంటూ బల్ల చరిచాడు

అవమానంతో లక్ష్మికి కాళ్లు వణి కాయి.

నోట మాట రాలేదు.

హాల్లోంచి రవీ, వాసూ, జానూ, చాలామంది గర్ల్ ఫ్రండ్స్ బయటకు నిష్క్రమిస్తున్నారు.

లక్ష్మికి కళ్లు తిరుగుతున్నట్ల నిపిం చింది.

డయాస్ దిగిపోయింది—''ఓహ్—'' గోల చేస్తూ విర్విరామంగా చప్పట్లు.

మాట్లాడిన వారిలో సురేఖాబెనర్జీయే ఉత్తమంగా మాట్లాడినట్లు న్యాయ నిర్ణే తలు తీర్పు చెప్పారు.

''ఆమె ఫస్టుప్రైజు గెలుచు కుంది.

పూర్ణిమనాటి సముద్రంలా మళ్లీ ఉప్పొంగిన జన సందోహం.

ఆ హడావుడిలో లక్ష్మి ఎప్పుడు ఇంటికి బయులు దేరిందో ఎవడికి పట్టింది కనుక.

* *

''నాన్నా — నేనిక చదువుకోను— నాకు తగ్గ వరుడే వస్తాడు—నేనుమాత్రం



ఇక కాలేజీకి పోను—అంతగా కాదంటే ప్రైవేటుగా కట్టుతాను—హిందీ నేర్చుకుంటాను'' — ఈ బాలాయిల బారికి పడలేక చివరకు మామకున్న కూతురు సౌజన్యాన్ని, సౌశీల్యాన్ని తండ్రి మెచ్చుకున్నా పెండ్లి సమస్య తలచుకునే సరికి తిరిగి ఆమె చేసింది మంచి పని కాదేమో అనిపించింది.

అయినా—ఆమె నిప్పుడు తిరిగి చదివింప జేయడం ఎవరిసాధ్య మవుతుంది.

లక్ష్మి ఎప్పుడు డిస్ కంటిన్యూ చేసిందో ఎవరికీ తెలియదు. ఎందుకు చేసిందో తెలుసుకునే కోరికా ఎవ్వరికీ లేదు కాలేజీలో. ఒక్క పద్మకు తప్ప. తక్కిన వారెవరూ ఆమె వస్తున్నదో లేదో కూడా పట్టించుకోలేదు.

కాని పద్మకుమాత్రం అసలు విషయం తెలుసు.

లక్ష్మి నేటివరకూ సమాజంలో ఒక సౌందర్య పీఠాన్ని అధిష్టించింది—ఆమెకీ మనుషులెవరూ అక్కర్లేదు నిజమేకాని అలా వాళ్లు తనచే తిరస్కరింప బడుతూనే తన్ను ఆరాధించడం మాత్రం ఆమె అంతరాంతరాల్లో తెలియకుండా దాగిన ఒక కోరిక కావచ్చు—ఆ పీఠాన్ని ఈ నాడు ఆమె కోల్పోయింది. ఆరాధింప బడ్డ చోట ఆమె అవమానం భరించలేదు.

పూలమ్మిన అంగట్లో ఆమె కట్టెలమ్మ లేదు.

అందుకే ఆమె రంగస్థలం నుండి నిశ్శబ్దంగా నిష్క్రమించింది — తల్లిదండ్రులకూ లోకానికీ ఎవ్వరికీ తెలియని ఒక అంతరంగ రహస్యం ఇది.

అనావిష్కృతమైన కఠోర సత్యం ఇది.

వాళ్ళ నాయనమ్మ మాత్రం అంది ''పాడు మనుషులూ పాడు బుద్ధులూ— మంచి వాళ్ళకు వీధిలో మెసలడంకూడా కష్టమైపోతున్నది—ఏం రావణా కాలమో గాని—''


భూ లోకంబున ఊర్వశి పేరున
అవార్డున్నచందంబున తన నామంబున
అవార్డు లేదేయని దుఃఖింబున
రంభ కోప గృహంబు జేరె - నారద!
రంభాప్రియ -
నలకూబర!
అవార్డానికిందగు
ఆందోళనంబు
రగిలింతము
రమ్ము!


We WANT RAMBHA AWARD
రంభ అవార్డు వెంటనే కావాలి!
100% సెక్సుతారకు రంభ అవార్డు ఏర్పాటు కావాలి!
జై! జై! రంభ
ఉత్తమ
పచ్చిశృంగార తారకు
రంభ అవార్డు
వాంఛనీయం!




బిడ్డ పుడతుందంటే ఎవళ్ళకయినా సంతోషమే. కాని, అమ్మాయి పుట్టిందని కబురొస్తే మట్టుకి మగవాడికా వార్త శుభవార్త కాదు. భయంకర వార్త. ఆ బరువు బాధ్యతలు పురుషుడికి మోపినట్టు పరాయివాళ్ళకి మొయ్యవు. అందుకనే అంత బాధ, వేదన. ఇప్పు డిలాంటి ఆపదనే ఎదుర్కోవలసొచ్చింది గురుచరణుడు— నెల అరవై టంగులు తెచ్చుకునే బ్యాంకి గుమాస్తా అతగాడు.

అసలీ వార్త పొద్దుటే మూటగట్టుక్కువచ్చింది. అతడి మూడో కూతురు పదేళ్ళ అన్నాకాళీ. "రా నాన్నా, చెల్లాయిని చూతువుగాని!" అంటూ ఎంతో ఉత్సాహంతో ఆప్యాయంగా తండ్రిని పిలవ్వొచ్చింది. ఆ పిల్ల.

అయిదోసారికూడా తన భార్య మళ్ళీ ఆడపిల్లనే కన్నదని ఇప్పుడు పురిటిగదినుంచి కబురు రాగానే గురుచరణుడి ముఖం తీరని విచారంతో వెల్లబడిపోయింది.

అద్దెకు తోలే జట్కాబండి గుర్రం చూశారు కదూ—ఆ అస్థిపంజరం అదీను

సరిగా అలాంటి స్వరూపమే ఇప్పుడు గురుచరణుడిది. కృశించి శల్యావశిష్టమై, బెంగతో విచారంతో పీక్కుపోయిన కళ్ళూ ముఖమూ, మన చైతన్యం, ఈ లోకపు గొడవా ఏమీ లేకుండా నిర్లిప్తతగా కనబడతాడు.

పురిటి కబురు చెవిని పడగానే చేతిలో హుక్కాగొట్టం అమట్టునే ఉండిపోయింది. తాతలనాటిది చివికిన జాకెసొకటి గోడకి చేరగిలవేసుకుకూచున్నా డతడు. గట్టిగా నిట్టూర్చుదామంటేకూడా ఇప్పుడు వంట్లో ఓపిక లేదు.

కూతురు అన్నాకాశీ వచ్చి, రమ్మని పిలవగానే గురుచరణుడు ఆమె ముఖంకేసి చూసి, "కాసిన్ని మంచినీళ్లు తెచ్చిపెట్టు తల్లీ!" అన్నాడు. వెంటనే మంచినీళ్ళకోసమని వెళ్లింది పిల్ల.

కాశీ వెళ్ళిపోగానే అతడి మనస్సులో ఏనాటివో లక్ష సంగతులు గభీమని గుబులు కొచ్చాయి. అలా గుబులుకు రావటంతో బుర్రలో ఎన్నెన్నో దురాలోచనలుకూడా ప్రవేశింపసాగినై:

తొలి పురిటికయిన ఖర్చెంత? అనేది మొట్టమొదటి జ్ఞాపకం. నిరుడీ రోజుల్లో రెండో అమ్మాయి పెళ్ళికోసమని చౌ బజారులో ఉండే రెండంతస్థుల మేడ కొదువ పెట్టడం జరిగింది. దాని తాలూకు వడ్డీ బాకీ ఆర్నెల్లుగా అలానే బకాయి ఉండిపోయింది, ఈ సంగతి గుర్తుకొచ్చింది.

పోతే—దసరా పండగలు దగ్గరికొచ్చాయ్. అప్పటికి చీరే సారే సిద్ధం చెయ్యాలి. అవి పెట్టి చిన్నమ్మాయిని అత్తారింటికి పంపాల్సిన పని ఒకటి నెత్తిమీద వున్నదింకా. ఇవన్నీ ఎవళ్ళతోనూ చెప్పకూడని గృహచ్ఛిద్రాల్లో కొన్ని.

ఇహ ఆఫీసు గొడవలు—రాత్తిరి ఎనిమిది తొమ్మిది గంటలు దాటినా, తల పగిలిపోతూందే గాని, 'డెబిట్' 'క్రెడిట్' కాలమ్స్ ఎంతకూ సరిపోవడం కనబడదు. ఈ లెక్కలన్నీ ఇవాళ మధ్యాహ్నం పన్నెండింటికల్లా 'ఆడిట్' కోసం చేత పట్టుకెళ్లాలి. పట్టుకెళ్ళి తీరాలి.

నిన్ననే పై ఆఫీసరు పెద్దాయన దిగాడు. వచ్చి ఏమన్నాడో తెలుసా?—"ఎవ్వరూ కూడా ఇహనించి మురికిగుడ్డలతో ఆఫీసుకి రాకూడదు. అలా వస్తే జరిమానా పడుతుంది" అని చెప్పి కఠినమైన ఆర్డరువేసి మరీ వెళ్లాడు.

మరో విషయం—ఈ రేవుకి ఇంటెడు గుడ్డలూ ఓ పెద్ద మేటగా వేయించుకుపోయాడు చాకలి. వాడేమైపోయాడో యేమో వారంరోజులాయె పత్తాలేదు. ఇవన్నీ చూడగా మనస్సు బేజారైపోయింది గురుచరణుడికి. హుక్కాగొట్టం చేత్తో అలానే ఎత్తిపట్టుకుని ప్రార్థన ప్రారంభించాడు:

"భగవాన్! ఈ కలకత్తా మహాపట్నంలో రోజూ ఎంతమంది కార్లకింద పడి చావటంలేదు? వాళ్ళంతా నాకంటే అపరాధులా? దేవుడా, నీ దయవల్ల పెద్ద కారొకటి నా గుండెమీదినించి పోతే ఎంత బాగుండును!"

అంటూంటే అన్నాకాళీ వచ్చి, "లే నాన్నా! ఇదిగో మంచినీళ్ళు!" అన్నది. ఆ గ్లాసెడు నీళ్ళూ ఒక్కగుక్కలో తాగేసి, "ఆ—వెళ్ళమ్మా! గళాసు పట్టుకపో!" అని మళ్ళీ పడుకున్నాడు.

ఇంతలో లలిత వచ్చి, "మామయ్యా, టీ పట్టుకొచ్చా, లే!" అని లేపింది. 'టీ' అనగానే అతడికి ప్రాణం లేచివచ్చినట్టయింది. "రా అమ్మా, రా, నా దగ్గిరకొచ్చి కూర్చో!" అన్నాడు. కూర్చున్నాక పిల్లదాని తల నిమురుతూ, "మా తల్లిని ఓ జమీందారింట పడవెయ్యగలిగానంటే, నా జీవితంలో ఒక గొప్ప పని నెరవేరినట్టే!" "ఆ దరిద్రుడు....మీ మామ ఇంటో పడటంమూలాన రాత్రింబవళ్లు ఏకిచాకిరీయే. అవునా?" అన్నాడు. తల తిప్పుతూ చెప్పింది లలిత: "అందరూ చెయటంలే! అలానే నేనూ...." "అయితే ఇవాళ వంట సంగతి?" అనడిగాడు. "నే చేస్తాగా, మామయ్యా!"

"నువ్వే వండుతావా? నీకు వంటకూడా చేతనవునా?"

"తెలుసు మామయ్యా, అన్నీ అత్తదగ్గిర నేర్చుకున్నా," నన్నది లలిత. గురుచరణు డామెను మనస్సులోనే ఆశీర్వదించాడు. అతడికో పెద్ద బెంగ తీరిపోయింది

కిటికీలోంచి చూస్తూ, "అరె, శేఖర్‌లా వున్నాడే!" అని గురుచరణుడు పలకరించేప్పటికల్లా ఆజానుబాహూ, అందగాడూ అయిన ఒక యువకుడు లోపటికొచ్చాడు.

"రావోయ్, కూర్చో! ఇవాళ పొద్దుట మీ పిన్ని ఎంత పనిచేసిందో విన్నావా! ఆడపిల్లని కన్నది!" అంటూ నిట్టూర్చి, ముఖం అదోలా పెట్టాడు. "అందులో ఎంత ఇదివుందో నా ఒక్కడికే తెలుసు" నన్నాడు.

"అలా అనకు బాబాయ్! పిన్ని వింటే కష్టపడుతుంది. అంతా దేవుడి దయ! అయినా మగబిడ్డ అయితేనేం, ఆడబిడ్డ అయితేనేం?"

"నాకూ తెలుసునయ్యా బాబూ, ఆ మాత్రం. కాని భగవంతుడు వెనకా ముందూ ఆలోచించడు. కాకపోతే, నేను పేదవాణ్ణి కదా, నాకింతమంది దేనికీ? ఈ యిల్లు కూడా మీ నాన్నకి తనఖా పెట్టినానాయె. దానికేంలే, నేనేం విచారపడను.

"కాని, ఇదుగో ప్రత్యక్షంగా చూడరాదూ? ఈ బంగారపు బొమ్మ, మా లలిత, జమీందారీ కుటుంబాల్లో పడాల్సిన పిల్ల! చూస్తూ చూస్తూ ఎవరి చేతిలోనో ఒహరి చేతిలో ఎలా పెట్టను చెప్పు. దీనికి పదమూడేళ్ళు వెళ్ళాయి. కాని....నా చేతిలో

యువ

పదమూడు పైసాలుకూడా లేక, ఇంతదాకా సంబంధం కుదరలే."

గురుచరణుడి కళ్ళలో గిర్రున నీళ్లు తిరిగినై. శేఖర్ మౌనంగా వున్నాడు. గురుచరణుడింకా ఇలా చెప్పాడు—

"చూడు నాయనా! మీ బంధువర్గంలో ఏదయినా సంబంధం కుదురుతుందేమో చూద్దూ. అన్నట్టు—ఈ కాలపు కుర్రాళ్ళు కట్నం లేకుండానే పెళ్ళి చేసుకుంటున్నారుటగా, పిల్ల నచ్చితే అలాంటిదేదైనా ఒకాటి చూసిపెట్టుమా. బాబూ! నే నాశీర్వదిస్తున్నా విను—నువ్వు మహారాజువవుతావ్. నిజానికి, మీ ఆశ్రయం చూసుకునే నే నీ వాడట్టులో ఉండగల్గుతున్నా. మీ నాన్న నన్ను సొంత తమ్ముడులా చూసుకుంటున్నాడు సుమా!"

"సరే చూద్దాం!" అన్నాడు శేఖర్.

"మరిచిపోకు నాయనా! చిన్నప్పట్నుంచీ లలిత నీ దగ్గరేగా చదువుకుంది! ఎంత దొడ్డబుద్ధి. ఎంత నిదానం, చూస్తూనే ఉన్నావుగా! ఇంత చిన్నవయస్సులో మా ఇంట వంటా, పెట్టూ అంతా అదే. మా సంసారమంతా అదే మోస్తూందంటే నమ్ము!

"వాళ్ళ నాన్నమాత్రం ఏం తక్కువ ఉద్యోగం చేశాడనా? సంపాదనంతా దానం చేసేశాడు. పిల్లదానికేమీ మిగల్చకుండా పోతే పోనీలే, ఆ పుణ్యమే, ఆ పురుషార్థమే దాన్ని కాపాడుతూంది. ఆ బలం కాకుంటే, ఇంత చిన్నపిల్ల అన్నపూర్ణ ఎలా కాగలుగుతుంది నువ్వే చెప్పు, శేఖర్!"

శేఖర్ ఏం చెప్పాలో, కాని నవ్వుకున్నాడు. అతడు లేదామనుకుంటుండగా, చటుక్కున అడిగేశాడు గురుచరణుడు—"ఇంత పొద్దుటే ఎక్కడికి నాయనా బయల్దేరావ్?"

"ఓ కేసు విషయమై బారిష్టరుగారితో మాటాడాలి...." అని లేచి నిలబడగానే, గురుచరణుడు మళ్ళీ—

"నే చెప్పిన సంగతి మనసులో పెట్టుకో బాబూ! అది కాస్త వామనచాయ అన్నమాట నిజమే అనుకో. అయితేనేం, చూడు ఆ కన్ను ముక్కు తీరూ, తొలికినులాదే ఆ చిరునవ్వూ. ఇలాంటి రత్నంపిల్ల లోకమంతా గాలించినా దొరకదని నమ్ము!"

నవ్వు ముఖంతో శేఖర్ తలవూపుతూ బయటికి వెళ్ళిపోయాడు. అతడి కిరవై అయిదేళ్ళ ప్రాయం. ఎం.ఎ. ఇప్పటిదాకా అప్రెంటిస్ చేస్తూ, నిరుడే 'అటర్నీ' అయ్యాడు.

అతడి తండ్రి నవీన్‌రాయ్‌కి బెల్లపు వ్యాపారం. అందులో లక్షలు గడించాడు.



ఇప్పుడా ఒడిసుట్లు పడలేక ఇంటోనే కూర్చుని వడ్డీవ్యాపారం సాగిస్తున్నాడు.

పెద్దకొడుకు అవినాశుడు వకీలు. చిన్నవాడే ఈ శేఖర్‌నాథ్. ఒ స్త్రీ మధ్యన మంచి వవరులో వాళ్ళకో మూడంతస్థుల మేడ వుంది. వీళ్ళ డాబా. గురుచరణుడిగారి డాబా కలిసేవున్నాయి. అంచేత రెండు కుటుంబాలవాళ్ళూ ఎంతో చేరికగా ఉంటారు. ఇంటో ఆడపిల్లలందరూ ఈ డాబామీదినించే వస్తూపోతూ వుంటారు.

## 2

చాలారోజులై శేఖర్‌కు శ్యాంబజార్లో ఒక గొప్పయింటి సంబంధం వలుగుతూ వుంది. పిల్లతాలూకువాళ్లొచ్చి పెళ్ళికొడుకుని చూసుకున్నారు. వచ్చే మాఘంలో ముహూర్తం పెట్టాలని ఉద్దేశం. అయితే కుఱ్రవాడు స్వయంగా పిల్లను చూసుకుని ఇష్టపడితేగాని వీల్లేదన్నది శేఖర్ తల్లి భువనేశ్వరి. నవీన్‌రాయ్ దృష్టి అంతా డబ్బు మీదనే. ముందుగా నిశ్చయం అనుకుంటే, తాంబూలాలు పుచ్చుకునేప్పుడు మళ్లీ చూసుకోవచ్చునంటాడు. భార్యాభర్తల మధ్యని మాటపొందిక కుదరలే. అయన

కోపం వచ్చింది. భోజనం కాగానే వీధిగదిలోకి పోయి పడక వేశాడు.

అయిదారురోజుల తరవాత—మూడో అంతస్థులో తన ముచ్చటయిన గదిలో నిలువుటద్దం ముందర నిలబడి, పిల్లని చూసిరావటానికని శేఖర్ ముస్తాబవుతున్నాడు.

అంతలో వచ్చింది లలిత ; "పిల్లని చూడ్డానికి బాగుందే .. ?" "అవును, నన్ను శీఘ్రా ముస్తాబుచేస్తూ!" అన్నాడు శేఖర్. లలిత నవ్వి. "ఇప్పుడు తీరికలేదు నాకు. డబ్బుకోసం వచ్చా!" నంటూ, బీరువాతాళం తీసి కావలసిన రూపాయిలు తీసుకుని చెంగున ముడేసుకుంది. "అవసరమైనప్పుడల్లా డబ్బు తీసుకెడుతున్నా. ఇదంతా తీరే దెలాగో! ' అని తనలో తను అనుకున్నట్టుగా అన్నది.

బూట్ తొడుక్కుంటూ "అదే తీరుతుంది" అని అనేసి, శేఖర్ వెళిపోయాడు.

* * *

రాత్రి శేఖర్ సోఫాలో పడుకునుండగా తల్లి భువనేశ్వరి వచ్చింది. "పిల్లని చూసివచ్చావు గదా, ఎలా వుందిరా?" "భేషుగ్గా వుం"దన్నాడు. తల్లి నవ్వి "అంతే ఎలా వుంటుంది? ఛాయ పసిమేనా? ఎవరిలా వుంటుంది? మన లలితలా...."

"లలిత నలుపు కదూ, అంతకన్న ఎరుపే!"

"కళ్లూ, ముఖం....?"

"అన్నీ బాగానే వున్నాయ్"

"మరైతే చదువుకుందా?"

"ఆ మాట నేనడగనే లేదమ్మా! జ్ఞాపకం లేకపోయింది."

"వరస చూస్తే, నువ్వా పిల్లని చేసుకోవల్లే వుందే?" శేఖర్ బదులు చెబుదా మనుకుంటూండగా లలిత మెల్లిగా గదిలోకి వచ్చి, భువనేశ్వరి వెనకాల నిలుచుంది. ఎందుకొచ్చావంటే. 'ఏమీలేదు అమ్మా!" అన్నది. భువనేశ్వరిని లలిత 'అమ్మా' అనే పిలుస్తుంది. "అటయితే నన్నోమాటు ఊరికే చూసిపోదామని వచ్చావా?" అనడిగింది. మాటాడలే లలిత.

శేఖర్ అన్నాడు : "చూడటానికయితే వచ్చింది. మరి వంట ఎప్పుడు చేస్తుందీ?" తల్లి చెప్పింది : "అది వంట చెయ్యటం దేనికిరా ?" ఆశ్చర్యపోయాడు శేఖర్. "అయితే మరి వాళ్ళకి వంట ఎవరు చేస్తారమ్మా? లలితే వంటా పనులూ అన్నీ చేస్తూందని అనాడు మామే అన్నాడుగా?"

"వాళ్ల మామయ్య అంతేలే. అలానే అంటూ వుంటాడు. దానికి పెళ్లి కాలేదు గదా, దాని చేతివంట ఎవరు తింటార్రా? మన వంటబ్రాహ్మణ్ణే అక్కడికి పంపించా. ఆయన చేస్తాడు. మనింటో పెద్దమ్మ చేస్తుంది. రెండుపూటలా నే వెళ్ళి వాళ్ళింటోనే



ఫోంచేసి వస్తున్నా" అన్నది.

సరే, ఈ పేద కుటుంబం తాలూకు భారాన్ని తన తల్లి ఆదుకుంది కదా అని శేఖర్ గ్రహించాడు. తృప్తి అయిన మనస్సుతో ఒక్కసారి నిట్టూర్చి. ఊరుకున్నాడు

* * *

నెల్లాళ్ళ తరవాత ఓనాడు—శేఖర్ నవల చదువుకుంటున్నాడు. గబగబలాడుతూ వచ్చి లలిత బీరువా తెరిచింది. ఇవాళ ఆమె చక్కా అలంకరించుకుంది. "పది రూపాయిలు తీసుకున్నా, శేఖర్‌దా!" అని చెప్పింది. "సరేలే!" అన్నా డతడు.

లలిత వెళ్ళటానికి తారట్లాడుతూంది. మళ్ళీ తిరిగివచ్చి తలుపు చాటున నిలబడి, "ఇవాళ నాటకానికి వెళ్లాలి" అన్నది. మాటాడలే శేఖర్. "మేం నాటకం చూట్టాని వెళుతున్నాం" అంది

"మే మంటే ఎవరెవరూ?"

"నేనూ, అన్నాకాళీ, చారుబాలా. వాళ్ళ మావయ్యా."

"మావఁయ్యెవరూ?"

"ఆయనే గిరీన్‌బాబు. ముంగేరునించి వచ్చాడు నాలుగురోజుల కిందట. ఇక్కడ బి.ఏ. చదువుతాడు. భలేవా డాయన...."

"ఓఁ—ఇంకేం? ఊరూ పేరూ, కధా ఖమామిషూ చాలా జరిగిందల్లే వుందే! అందుకనేనా ఎక్కడా కంటి కగపడటమే మానేశావ్? పేకాటలో మునిగిపొయ్యావ్ కాబోలు!" అన్నాడు శేఖర్.

శేఖర్‌లో హఠాత్తుగా మారిన ఈ ధోరణికి భయపడింది లలిత. "ఇన్నాళ్ళనించీ పేకాట జోరుగా సాగుతూంది కమా?" అనడిగాడు. గుటకలు మింగుతూ, లలిత "వారు చెప్పిందా యేం?"

"వారు చెప్పిఁదో, మరెవరు చెప్పారో. ఏకంగా చీరే అదీ కట్టుకు రెడీగానే వచ్చేశావుగా? సరే, వెళ్లూ!"

వెళ్ళలేకపోయింది లలిత. మాటాడక అక్కడే నించునివుంది.

# 3

పక్కింటి చారుబాల లలిత నేస్తురాలు. ఇద్దరూ ఒహ ఈడువాళ్ళే. ఆ అమ్మాయిది బ్రహ్మసమాజ మతం. వాళ్ళందరినీ శేఖర్‌కు తెలుసు, గిరీన్ తప్ప గిరీన్ ఇప్పటిదాకా బంకింపూర్‌లో చదువుతున్నాడు. కలకత్తా ఎప్పుడూ రాలేదు. అందుకనే అతన్ని శేఖర్ ఎరగడు.

లలిత అలానే నిలబడివుండటం చూసి శేఖర్ "ఎందుకలా నించున్నావ్, వెళ్లూ!" అనేసి మళ్ళీ పుస్తకం ముఖానికి అడ్డుపెట్టుకున్నాడు.

లలిత మళ్ళీ మెల్లగా "వెళ్ళనా?"

"చెప్పాగా లలితా, వెళ్ళమనీ!"

శేఖర్ ధోరణి అదోలా వున్నది, కనుక వెళ్ళాలనిపించలేదు లలితకు. కాని, వెళ్లకుండా ఉండటానికీ వీల్లేకొచ్చింది. ఏమీ?—సగం ఖర్చు ఈ మెదీ, తక్కిన సగం చారుబాల మామదిన్నీ. ఇదీ ఇవాల్టి ఏర్పాటు. వాళ్ళంతా లలితకోసం ఆత్రంగా ఎదురుచూస్తున్నారు. ఉపాయం తోచక మళ్ళీ అడిగింది లలిత: "వెళ్లనా?—ఇవాళ ఒక్కరోజు కే!"

పుస్తకం ఓ పక్కకి విసిరేశాడు శేఖర్. "నన్ను విసిగించకు లలితా! ఇష్టముంటే వెళ్లూ, మంచి చెడ్డలు గ్రహించగల వయస్సే నీది!" అని గద్దించాడు.

తుళ్ళిపడింది లలిత. ఈ మధ్య ఇంత తీవ్ర ధోరణిలో శేఖర్ మాటాడ్డం వినలే.




విజావికి. అతడిచ్చిన చనువును బట్టే ధైర్యంతో ఏకంగా దుస్తులు మార్చుకు తయారై వచ్చేసింది. ఆ స్వాతంత్ర్యం లోపించటం ఇప్పుడు తన పదమూడోఏట గ్రహించిందామె. దీన్ని గురించి లోలోపల కుమిలిపోతూంది.

కళ్ళనీళ్ళు తుడుచుకుంటూ తన గదికి వెళ్ళిపోయి. దాసీదానిచేత అన్నా కాళీని పిలిపించింది. ఆపిల్ల దానిచేతికి ఆ పసిరూపాయిలూ ఇచ్చి ఇవాళ్టికి మీరంతా వెళ్ళండి. కాళీ! నా వంటో ఏం బాగులేదు'' అంటూ పక్కమీదికిపోయి పడుకుంది.

తరువాత చారుబాల కూడా వచ్చి ఎంతగానో బతిమాలింది. బలవంతం చేసింది. ససేమిరా రాననేసింది లలిత.

చారుబాల తల్లి మనోరమకు పేకాటంటే ప్రాణం. ఆమెకు అపేక్ష వుందిగాని ఆడే నేర్పులేదు. అందుకోసమని లలితను పట్టుకునేది. లలిత చాలాబాగా ఆడుతుంది.

మనోరమ పినతల్లి కొడుకే గిరీన్. అతడు వచ్చినప్పట్నించీ పేకాట జోరుగా సాగుతోంది. గిరీన్ మంచి ఆటకాడు. అందుకనే అతనికి ఎదిరి పక్షంలో కూర్చోబెట్టటానికని మనోరమ లలితను పట్టుకునేది.

మామూలు వేళకు లలిత రాకపోయే సరికి మనోరమ దాసీదాన్ని పంపింది. ఇప్పుడేమాత్రం వీల్లేదు, రేపొస్తానన్నది లలిత. చివరకి మనోరమే స్వయంగా వచ్చి, ఎలాగో ఆమెను తీసుకుపోయింది. ఆటమీద మనస్సు లేకపోయినా, తప్పనిసరిగా

కూచుంది లలిత.

"రాత్రి మీరు డబ్బయితే పంపారుగాని. మేం నాటకానికి వెళ్ళలే. రేపురండి. అందరంకలిపి వెళ్ళదాం!" అన్నాడు గిరీన్. వంటో ఇబ్బిగా వున్నదని చెప్పేసి గబగబా వెళ్ళి పోయింది లలిత.

ఇవాళ గిరీన్ ఎదట కూర్చుని ఆడుతున్నంతసేపూ ఆమె మనస్సుకి ఎలాగో వుంది. ఈ కొద్దిరోజుల పరిచయానికే అతడు తనని ప్రేమదృష్టితో చూస్తున్నాడని తోచింది.

ఇంటోకి వెళ్ళి ఓమాటు కనిపించింది లలిత. శేఖర్ గదిలో మామూలుగా ఆపనీ ఈపనీ చేస్తూంది. అతని గది చక్కగా అమర్చే పని లలితదే. మరొహాళ్ళ వల్లకాదు. ఎనిమిదవఏట తలిదండ్రులు పోయాక లలిత మేనమామ గారింటికి వచ్చింది. అప్పట్నించీ చెల్లెలిలాగా శేఖరుడి వెంట మసులుతూ, చదువునేర్చి, ఈపాటిదయింది.

లలితంటే శేఖర్‌కు ఎంతో అభిమానమని అందరికీ తెలుసు. అదెవ్వరికి ఎబ్బెట్టుగా ఏం లేదు. ప్రత్యేకించి ఎవరి దృష్టినీ ఆకర్షించనూ లేదు. ఎప్పటికయినా ఆమె ఈ ఇంటి కోడలుగా వస్తుందేమోనన్న భావనకూడా ఎవ్వరికీ కలుగలేదు. లలితకీ కలుగలేదు. భువనేశ్వరి అనుకోలేదు.

*　　　　*　　　　*

పని పూర్తి చేసుకు వెళదామని ఆ ధ్యాసలో వుంది లలిత. హఠాత్తుగా బూట్లు చప్పుడు విని, ముఖం పైకెత్తి, పక్కకి తప్పుకు నిలబడింది. గదిలోకి వస్తూనే శేఖర్ అడిగాడు.

"నిన్నరాత్రి ఎప్పుడొచ్చావ్ ఇంటికి? రెండింటికా, మూడింటికా?—మాట రాదేం, నోట్లోంచి?" మౌనంగా నిలబడి వుంది లలిత.

"వెళ్ళు కిందికి, అమ్మ పిలుస్తోంది!"

భువనేశ్వరి పళ్ళాలు పరిచి టిఫిన్లు సర్దుతూంది. "ఈ ఫలహారం మీ శేఖర్‌దాకిచ్చి, చప్పునరా!" అన్నది లలితతో.

పళ్ళెం పట్టుకెళ్ళి, లలిత ఒక్కక్షణం ఆగి, మేడమీది కెళ్ళింది. శేఖర్ ఆఫీసు దుస్తులయినా విడవకుండా కళ్ళు మూసుకుని ఇంకా అలానే చేరగిలపడి వున్నాడు. లలిత మెల్లిగా దగ్గిరకొచ్చి, "ఫలహారం తెచ్చా!" నన్నది.

"అక్కడే పెట్టి వెళ్ళు!"

లలిత పెట్టలేదు. అలానే చాలాసేపు నించుని వుంది. "ఎంత సేపని నించుంటావ్ లలితా! నా కింకా ఆలస్య ముంది. అక్కడే పెట్టి వెళ్ళమన్నాను గా!"

ఇంకా అలా వింటునే చెప్పింది లలిత. "అలస్యమైనా ఇబ్బందిలేదు. నాకు ముంచుకుపోయే పనేం లే దక్కడ."

కళ్ళు తెరిచాడు శేఖర్. నవ్వుతూ, "ఏదీ, నోట్లోంచి మాట వచ్చిందే! కిందని పని లేకపోతే ఆ యింట్లో లేదూ! అక్కడా లేకపోతే పక్కింటో నయినా లేక పోతుందా! నీకు ఒక్క ఇల్లే కాదుగా?" అన్నాడు.

కోపమొచ్చి, లలిత చేతిలో పళ్లెం టపీమని టేబిల్ మీద పెట్టేసి పోబోతూంది.

"సాయంత్రం ఒక్కమాటు రావేం!" అని కేకేశాడు శేఖర్.

"వందసార్లు పైకీ కిందికీ నే రాలేను!" అంటూ గబగబా వెళ్లిపోయింది.

కిందికి దిగిరాగానే భువనేశ్వరి "అమ్మాయీ! ఫలహారమయితే ఇచ్చి వచ్చావ్ గాని, అన్నయ్యకి తాంబూలం ఇవ్వలేదేమే?" అనడిగింది.

"నే పోలేను. నాకాకలేస్తోందమ్మా! మరెవరికయినా ఇచ్చిపంపించు" అని, పతికిల బడింది, లలిత. ఆమె కోపంగా ఉండటం చూసి నవ్వుకుందామె.

"సరే, నువు కూర్చో—దాసీదాని చేతికిచ్చి పంపుతాలే!"

లలిత ఫలహారం ముందర కూర్చుంది.

తను నాటకానికి వెళ్ళకపోగా, శేఖర్ తన నెందుకని కేకనెయ్యాలీ? ఈ కోపంతో నాలుగైదు రోజులు ఆమె శేఖర్ కంట బడటమే మానివేసింది. అయినా అతడు ఆఫీసుకి వెళ్ళాక మధ్యాన్నమప్పుడు గదిలోకి వెళ్ళి, అతని పనులన్నీ చేసి పెడు తూనే వుండేది.

శేఖర్ తన తొందరపాటు గ్రహించాడు, కబురుచేశాడు మరునాడు. అయినా లలిత రాలే.

## 4

ఒక ముసిలివాడు అప్పుడప్పుడా వీధికి బిచ్చానికి వస్తుంటాడు. వాడిమీద లలిత కెంతో దయ. వచ్చినప్పుడల్లా ఓ రూపాయిస్తూండేది. అది చేతులో వేసుకుని వాడు అపూర్వంగా కురిపించే దీవెనలు వినటం లలితకు వల్లమాలిన సరదా. "ఏదీ మా తల్లి, ఎక్కడుందీ?" అంటూ ఇవాళ పొద్దున్నే వచ్చి పిలిచాడు. లలిత కంగారు పడింది. రూపాయి ఎలా వస్తుందీ?—శేఖర్ గదిలో వున్నాడు. అత్తయేమో దాసీ దానితో పోట్లాడి చీకాకుగా వుంది.

అన్నాకాళి పరుగెత్తుకుంటూ వచ్చి, "మీ అబ్బాయి వచ్చాడు వదినా!" అన్నది. "కాళీ, ఓ చిన్నపని చేసిపెట్టు తల్లీ! శేఖర్దా దగ్గరికెళ్ళి, ఒక్కరూపాయి తెచ్చి

పెటమ్మా!'' అని చెప్పి లలిత పంపించింది.

మరు నిమిషంలో తెచ్చేసి "ఇదిగో!" అంటూ లలిత చేతిలో పడేసింది. అది బిచ్చగాడికిచ్చి పంపివేసింది లలిత. ఇవాళ వాడి దీవెనలు వినటానికేం అనక్తిగాలేదు.

కొన్నాళ్లుగా పేకాట బాగా సాగుతోంది. ఇవాళ మధ్యాహ్నం లలిత వెళ్లలే. ఒంట్లో బాగులేదని చెప్పి పడుకుంది. ఆమె మనస్సు వికలమై వుంది. కాశీనుంచి శేఖర్ భోగట్టాలెన్నో తరిచి తరిచి అడిగి తెలుసుకున్నది. మాట సందర్భం వచ్చి, "కాశీ! పేకాట సంగతి నువు చెప్పావా!'' అని కోపంగా అడిగింది. అందుకు కాశీ—

"నువ్వేళుకున్నావుగా చారుదాదా ఇంటికి! ఆ సంగతే చెప్పాను. ఎవరెవరు ఆడుతున్నారని అడిగితే అందరి పేర్లూ చెప్పాను. అంతే."

"ఎందుకు చెప్పావ్! అన్ని గొడవలూ వీకే కావాలి...." అంటూ, లలిత అక్కణ్ణించి వెళిపోయింది.

రెండు రోజుల్నించి పేకాట బంద్ అయింది. లలిత రాలే. తొలిసారిగా చూచి నప్పటినించే గిరీన్ తనపైన కన్నువేసినట్టు లలిత అనుమానిస్తూనే వుంది. ఆ అనుమానం ఇప్పుడు మరింత బలపడింది. ఏమీ?—ఈ రెండురోజులాయి గిరీన్ పరధ్యానంగా ఉండటం. ఇల్లు కదిలి ఎక్కడికీ షికారు పోకపోవటం, ఏం తోచక ఆ గదుల్లోనే పచార్లు చేయడం—ఇవీ లక్షణాలు!

ఇవాళ ఆటకు నాలుగో చెయ్యి లోటు. వెళ్ళి పిలుచుకురమ్మని అతడు మనోరమని ఒత్తికిచేస్తే, ఆమె వెళ్ళి ఎలానో లలితను లాక్కొచ్చింది. ఇవాళ ఆట రక్తికట్టింది. లలిత పక్షమే గెలుపూ!

కాస్సేపయ్యేసరికి కాశీ వచ్చి "వదినా, శేఖర్‌దా పిలుస్తున్నాడు! ఊఁ—లే, జల్దీ!'' అని వేగిరపెట్టింది. లలిత ముఖం వెలవెలబోయింది. చేతిలో ఆ పేక ముక్కలు అక్కడే వొదిలేసి, కంగారుపడుతూ లేచి నించుంది. "వెళ్ళొస్తా పిన్నీ! లేదంటే, ఆయన కోపమొస్తుంది!'' అంటూ గబగబా వెళిపోయింది.

* * *

"శేఖర్‌దా ఎవరక్కయ్యా!'' అడిగాడు గిరీన్.

"అదుగో, ఎదురుగ్గా ఆ పెద్దమేడ లేదూ? వాళ్ళదబ్బాయి!'' అని చెప్పింది మనోరమ.

"ఓ—ఆ యిల్లా! నవీన్‌బాబువాళ్ల బంధువా?"

నవ్వుతూ చెప్పింది మనోరమ: "బంధువేమిటీ! ఆ ముసలాడు లలితవాళ్ల ఇల్లు కూడా కలుపుకోవాలని ఎత్తువేస్తే!"




''నిరుడు డబ్బులేక గురుచరణబాబు కూతురి పెళ్లి చెయ్యలేకపోయ్యాడుగా! అప్పుడు నవీన్‌రాయ్ తలముంచే వడ్డీపైన డబ్బిచ్చి, అతగాడిల్లు తనఖా పెట్టించుకున్నాడు. ఈ అప్పు తీరేదేం కాదు. చివరికా యిల్లు కాస్తా ఎటూ కాజేస్తాడు నవీన్‌రాయ్'' అంటూ కథ అల్లి చెప్పింది మనోరమ.

గురుచరణుడి పాత ఇల్లు పడగొట్టించి, అక్కడే చిన్నకొడుకు శేఖర్‌కి ఓ పెద్ద భవనం కట్టించాలని ముసలివాడి మనస్సులో ఉద్దేశం అనికూడా చెప్పింది.

ఇదంతా వినేసరికి గిరీన్‌కి కష్టం తోచింది. ''గురుచరణబాబుకి ఇంకా ఆడపిల్లలున్నారు గదా, వాళ్ళందరికీ పెళ్లిళ్లు ఎలా చేస్తాడూ?'' అనడిగాడు గిరీన్.

''లేకేం. వున్నారు. పైగా ఈ లలితకూడాను. ఈ అమ్మాయికి పాపం, తల్లీ తండ్రీ లేరు. ఆమె బరువుబాధ్యతలంతా ఈ పేదవాళ్ళపైనే వుంది. ఈడు వచ్చిన పిల్ల లలిత. ఈ యేడయినా తప్పక పెళ్లిచేసే తీరాలి. వాళ్ళ సంఘంలో వచ్చిన ముప్పేమిటనుకున్నావ్? వెలివేయటానికంతా సిద్ధమేకాని, సాయం చెయ్యటానికి మాత్రం ఎవరూ ముందుకు రారు. ఆమాటకొస్తే మన పనే హాయిగా వుంది, గిరీన్!'' అన్నది మనోరమ. గిరీన్ ఏమీ చెప్పక మౌనంగా ఉన్నాడు. కాని, ఆమె ఇంకా చెప్పుకుపోతూనే వుంది—

''లలిత ప్రస్తావన వచ్చి, ఆవేళ వాళ్ళత్తగారు నా ముందర రాగాలెట్టింది. ఏం చెయ్యటమో, ఎలా చెయ్యటమో వాళ్ళకేం దిక్కు తోచటంలే. దిగులుతో గురుచరణ

ఱడు కుంగిపోయాడు. నిద్రాహారాల్లేవు వాళ్లకు. ఆఁ, అన్నట్టూ—ముంగేరులో కేవలం పిల్ల లక్షణాలు చూసి పెళ్ళిచేసుకునేవాళ్లు నీ స్నేహితుల్లో ఎవరైనా లేరూ? ఇలాంటి పిల్ల దొరకడం చాలా కష్టం సుమీ, గిరీన్!''

విషాదంగా ఒక్క నవ్వు నవ్వాడు గిరీన్. ''అలాటి స్నేహితు లెవరున్నా రక్కయ్యా! డబ్బు సర్దుబాటు కావాలంటే నే సాయం చేయగల!'' నన్నాడు

గిరీన్ తండ్రి డాక్టర్‌గా ఉండి. కొల్లలుగా ఆస్తి గడించిపోయాడు. దానంతటికీ ఇప్పుడు గిరీనే యజమాని.

''అయితే, డబ్బు అప్పుగా ఇస్తానంటావా'' అనడిగింది మనోరమ.

''అప్పేమిటక్కయ్యా! తీర్చగలిగితే తీరుస్తారు, లేకపోతే లేదు ...!''

''అయితే నీకేమిటి లాభం? వాళ్ళు మనకేం చుట్టాలా? కనీసం మన సమాజపు వాళ్ళయినా కాకపోయిరి!'' అన్నది ఆశ్చర్యంగా.

''మన సమాజపువాళ్లు కాకుంటే మాత్రమేం, మన దేశస్థులే కదా? వాళ్లేమీ లేని వాళ్ళు. నేను పుష్కలంగా కలవాణ్ణి. వాళ్ళ కంగీకారమయితే ఇవ్వటానికి నాకేం అభ్యంతరం లేదు. లలిత వాళ్లకి ఏం కాదు. నాకూ ఏం కాదు. అసలు పెళ్ళికయే ఖర్చంతా పోనీ, నేనే భరిస్తా.''

ఇప్పటిదాకా మెదలకుండా పున్న చారుబాల సంతోషంతో ఎగిరి గంతేసింది. ''అయితే. ఇవ్వు మావయ్యా! నే వెళ్ళి వాళ్ళత్తతో చెప్పొస్తానూ'' అన్నది.

''ఊరికే వుండు చారూ! నీ కెందుకీ గొడవలన్నీ? చెప్పాల్సివస్తే నేనే వెళ్లి చెబుతాలే!'' అంటూ మనోరమ కూతుర్ని గద్దించింది.

''అయితే చెప్పేసి రా అక్కా! మొన్న రోడ్డుమీద ఎదురయ్యాడు గురుచరణ బాబు. క్షణంసేపు మాటాడితేనే తెలిసిపోయింది ఆయనెంత మంచివాడో! ఎంత మంచి మనసు!—ఏమంటావ్?''

''ఏమంటావేమిటీ? వాళ్ళు—ఆ భార్యాభర్త లిద్దరూ అమాయకులే, గిరీన్. అందుకే వాళ్ళకీ కష్టాలు! అలాంటివాళ్ళకి కొంపా గోడూ లేకుండా పోయేట్టుం దిప్పుడు. దానికంతా నిదర్శనం చూస్తూనే ఉన్నావుగా. శేఖర్‌బాబు పిలిచా డనగానే, ఎంత ఖంగారుగా లేచి పరిగెత్తిందో లలిత? వాళ్లింటో అంతా ఆ కుటుంబానికి అమ్ముడుపోయినట్టుగానే వుంటారు. అయితే—నీకెంతగా వాళ్ళని సంతోషపెడదామనుకున్నా, నవీన్‌రాయ్ చేతిలో ఒకసారి పడ్డాక మరి బయటపడటం కలలో వార్త!''

''అయితే—నువ్వెళ్ళి చెబుతావా అక్కయ్యా?''

"సరే, అడుగుతా, ఇస్తే పోనీ, వాళ్ళకి నువ్వే ఉపకారం చేసినవాడి వవుతావ్. మంచిదేగా?" అని, చిరునవ్వుతూ ఇలా అడిగింది మనోరమ: "అవునుగాని గిరీన్, ఈ విషయంలో నీకింత ఆసక్తి దేనికి?"

"మహా, ఆసక్తికేముంది అక్కా! కష్టసమయంలో ఒకరికొకరం ఆ మాత్రం ఆదుకోకపోతే ఎలా చెప్పు!" ఇలా అని కొంచెం సిగ్గుపడుతూ అక్కణ్ణించి వెళ్ళిపోయాడు. గుమ్మందాకా వెళ్ళి మళ్ళీ వచ్చి కూర్చున్నాడు.

"ఏంరా గిరీన్, మళ్ళీ వచ్చి...?"

గిరీన్ నవ్వుతూ, "నువ్వింతగా చెప్పావే, వాళ్ళ కష్టగాథ? అదంతా నిజమో కాదో అక్కా?" అన్నాడు.

"ఎ.దుకని?" ఆశ్చర్యంతో అడిగింది మనోరమ.

"వాళ్ల లలిత ఆ డబ్బు ఖర్చుపెట్టడమూ అదీ చూస్తే, బీదవాళ్ల పిల్ల అనిపించదు అక్కా! ఆ రోజున మేం నాటకానికి వెళ్ళేనాడు తను రాలేదుగాని, మమ్మల్ని వెళ్ళమని పదిరూపాయలిచ్చి పంపించింది. డబ్బు ఎంతెలా ఖర్చుచేస్తుందో ఇంకా చారు నడిగి చూడూ!"

నమ్మలేదు మనోరమ.

"నిజమేనే అమ్మా! అదంతా శేఖర్‌బాబు డబ్బు. ఇప్పుడే కాదు. చిన్నప్పట్నించీ ఆమె చనువుగా శేఖర్‌నా బీరువా తెరిచి డబ్బు తీసుకుంటుంది. ఆయనెదటే తాళం తీసి డబ్బు తెస్తుంది. ఎవళ్ళూ ఏమీ అనరు. మరి, మొన్నను అన్నకాళీ బొమ్మల పెళ్ళికి అంత డబ్బెవరిచ్చా రనుకున్నావ్? అంతా లలితే తెచ్చిచ్చింది" అని చెప్పింది చారుబాల.

ఆలోచనలో పడింది మనోరమ. "ఎవరెరుగుదురు? అయినా ఒక్కమాట నిజం. కొడుకుమాత్రం తండ్రిలాగా పీనాసి కాడు. అతడంతా తల్లి పోలిక. అందుకనే ఆ దానధర్మాలూ అవీన్నీ. అదీగాక—లలిత ఎంతో మంచిపిల్ల చిన్నప్పట్నించీ "అన్నా అన్నా" అని పిలుస్తూ ఎంతో కలివిడిగా కూడాహాడా తిరిగేది. అందుకనే లలితంటే అందరికీ అంత అపేక్ష....చారూ! నువ్వు వాళ్ళింటి కెళుతూ వస్తుంటావు గదా, వాళ్ళ శేఖర్‌కి ఈ మాఘంలో పెళ్ళిటగా! కట్నంకింద ముసిలాడు బోలెడంత గుంజకుంటాడటగా, అందరూ అనుకుంటున్నారు?"

"అవునే అమ్మా, నిజమే! వచ్చే మాఘంలోనే పెళ్ళి. అంతా నిశ్చయమైపోయింది" అని చెప్పింది చారుబాల.

# 5

కొద్ది రోజుల పరిచయానికే గిరీన్‌కి గురుచరణుడితో స్నేహబంధం ఏర్పడింది.

సాయంకాల మప్పుడు "గిరీన్‌మామని టీకి పిలుచుకురా లలితా!" అని కబురంపేవాడు గురుచరణుడు. టీ సమయంలో ఇద్దరూ గోష్టి ప్రారంభించే వారు. వాళ్ళమామయ్య చాటున కూర్చుని, లలిత అప్పుడప్పుడు ఆ సంభాషణలు వింటూం దేది. గురుచరణుడి హృదయంతో గిరీన్ మాటలు ఏకీభవించేవి.

"నిజమే గిరీన్!—ఎవరి పిల్లలకి వాళ్ళు ఈడు మించకుండా, మంచి సంబంధం చూసి పెళ్ళిళ్ళు చేసెయ్యాల్సిందే. కాని ఎలా? "పెళ్లి చేసెయ్ పిల్లకి. ఈడు మీరి పోతూంది...." అంటుంది సంఘం. కాని దానికి అవసరమైన సహాయం, ఏర్పాటు—వీటిమాట యేం చెప్పదు.

"ఎ రి సంగతో ఎందుకు గిరీన్! ప్రత్యక్షంగా నాసంగతే చూడరాదూ? ఇల్లు కూడా తనఖా పెట్టేశాను కదా! రెండు రోజులుపోతే, పిల్లా జెల్లాని వెంటపెట్టుకుని నడివీధిన నిలబడాల్సి వస్తుంది.

అప్పుడైనా ఈ సమాజం "రండి! మాఇంటో ఆశ్రయం ఇస్తాం" అన్నమాట అనదు. ఏమంటావ్?"

మౌనంగా ఉన్నాడు, గిరీన్.

"ఇలాంటి సమాజంలో ఉండటంకన్న జాతిని వొదులుకోవటం మేలు. తిన్నా తినకపోయినా ప్రశాంతంగా పడివుండొచ్చు. దుఃఖంలో ఉన్నవారిని అర్ధంచేసుకోలేని సమాజం, ఆపదలో ఉన్నవారికి ధైర్యం చెప్పలేని సమాజం, గుడ్లురిమి గొంతు పిసికే సమాజం నాలాంటి పేదవాళ్ళకి కాదు గిరీన్! అది భాగ్యవంతులకోసం పుట్టిన సమాజం. సరే. వాళ్ళనే బతికి బాగుండనీ. మాకవసరం లేదు...." అని ఆగాడు గురుచరణుడు.

ఇవన్నీ శ్రద్ధగా విని, లలిత రాత్రిళ్లు నిద్దరొచ్చేవరకూ వీటిని గురించే ఆలోచించేది. గిరీన్‌బాబు మాటలన్నీ న్యాయసమ్మతాలే అని మనస్సులో అనుకునేది.

ఇప్పుడు—తనకెంతో అపేక్షగల మామ తనకోసమే నిద్రాహారాలు మానుకుని వ్యాకులపడుతున్నాడు. తనకి ఆశ్రయం ఇవ్వటం చేతనే ఇంత బాధపడాల్సి వచ్చింది. అటువంటి మామయ్యకి జాతి ఎందుకు పోవాలి? తనమామతో ఏకీభవిస్తున్న గిరీన్‌పట్ల అంతరంగికంగా గౌరవం చూపసాగింది.

ఇంతవరకూ లలితను గిరీన్ "మీరు" అని అంటూండేవాడు. అలాకూడదు.




"మవ్వ" అని పిలుస్తూండమని గురుచరణుకు చెప్పాడు. ఒకనాడు గిరీన్ 'నువ్వు టీ తాగావా, లలితా?' అనడిగాడు. "ఊహూ" అన్నట్టు తల తిప్పింది. గురుచరణు డన్నాడు—"వాళ్ళ శేఖర్‌దా వొద్దన్నాడు. ఆడవాళ్లు టీ తాగటం అతడి కిష్టంలేదు."

* * *

టీ తాగటం పూర్తి అయింది. కాని గురుచరణు దివాళ రోజూ అంత ఉత్సాహంగా సంభాషణలో పాల్గొనటం లేదు. మధ్య మధ్యని పరాకుగా ఉంటున్నాడు. ఇది గమనించాడు గిరీన్.

"ఇవాళ మీ వంట్లో అట్టే బాగాలేదనుకుంటాను? ఆఫీసులో ఏమైనా....?"

ఇదివరకు మాటాడని లలిత కూడా అడిగింది; "అవును మామయ్యా! ఇవాళ నీ మనస్సు బాగా లేదల్లే వుందే?"

గురుచరణుడు నవ్వుతూ, "ఓ, అదా సంగతి! అవునమ్మా. నువు సరిగ్గా కని పెట్టావ్. నిజంగానే ఇవాళ నాకు మనస్సు బాగాలేదు" అన్నాడు.

లలితా, గిరీన్ ఇద్దరూ ఆయన ముఖంకేసి చూస్తూ వూరుకున్నారు. గురుచరణ బాబు చెప్పాడు: "నా స్థితిగతులు యావత్తూ తెలిసికూడా, నవీన్‌దా నన్ను రోడ్డుమీద నిలబెట్టి కఠినంగా అడిగాడు. ఆయన తప్పుమాత్ర మేముందిలే! ఆరునెలలు దాటింది. అసలుమాట అలావుంచి వడ్డీ అయినా ఒక్క పైసా దక్కకపోతే ఎవడైనా ఊరుకుంటాడా?"

"నువ్వు దాన్నిగురించి ఆలోచించకు మామయ్యా! తరువాత చూసుకుందాం!" అనేసింది చటుక్కున లలిత—ఈ ప్రసంగం పరాయి వాళ్ళెదుట ఎత్తడం ఇష్టంలేక.

వినిపించుకోలేదు గురుచరణుడు. "ఇహ తరవాత ఏముందమ్మా!—అదికాదు గిరీన్! ఈ ముసిలిఅబ్బాయి దిగులు పెట్టుకోకూడదని మా అమ్మ అనుకుంటూ వుంటుంది. కాని, ఈ మామ కష్టాలకేసి చూడనయినా చూడరుగా బయటివాళ్లు! అయినా వాళ్ళకేం పట్టిందిలే! ఏమంటావ్ లలితా!"

గిరీన్ అడిగాడు: "ఇవ్వాళ నవీన్‌బాబు ఏమన్నాడూ!" ఈ సంగతులన్నీ గిరీన్‌కి తెలుసునన్న విషయం లలిత ఎరగదు. అందుచేత తనకు సంబంధంలేని ఈప్రశ్నకు ఆమె లోలోపల కోపంతెచ్చుకున్నది.

స్పష్టంగా చెప్పేశాడు గురుచరణుడు—

"నవీన్‌రాయ్ భార్య చాలారోజులై ఏదో వ్యాధితో బాధపడుతున్నది. ఇప్పుడు ముదిరిపోయింది. గాలి మార్పుకోసం ఎక్కడికో వెళ్లాలిట! అంటే బోలెడంత డబ్బుఖర్చు సమయం. కనుక ఇప్పుడు పూర్తి వడ్డీ, అసల్లో కొంత జమకట్టే గాని మాట దక్కదు."

ఒక్కక్షణం ఊరుకుని గిరీన్ "మీతో ఒక్క విషయం చెబుదామనుకుంటూనే తెలీకుండా కాలం గడిచిపోతూంది. ఇప్పుడు చెబుదామని వుంది. మీరేమీ అనుకోరు గదా!"

నవ్వుతూ గురుచరణుడు "నాతో ఏం చెప్పాలన్నా ఎవ్వరూ ఎప్పుడూ సంకోచించరు. ఏమిటా సంగతీ!"

"ఏంలేదు. నవీన్‌బాబు ఎక్కువ వడ్డీ తీసుకుంటాడని అక్కయ్య చెప్పగా విన్నా. అందుకని నే ననేదేమిటంటే—నా దగ్గర చాలా డబ్బుంది ప్రస్తుతం ఏమంత పనిలేకుండా ఊరికినే వుంది కూడా. వారికీ అగత్యమూ లేదు! పోనీ ఈ అప్పు తీర్చి వేస్తే బాగుంటుందేమోనని...."

లలితా, గురుచరణుడూ ఇద్దరూ ఆశ్చర్యంతో అతడి ముఖంకేసి చూస్తూ ఊరుకున్నారు.

మళ్ళీ చెప్పాడు గిరీన్—ఇప్పుడు నాకాడబ్బుతో అవసరమేంలేదు. కనుక మీ కెప్పుడు వీలయితే అప్పుడు ఆ రుణం తీర్చవచ్చు. వారికి అనవసరంగా.... అందుకనే చెబుతున్నా" అన్నాడు గిరీన్.

"ఆ పైకమంతా ఇస్తావా నువ్వు" అడిగాడు గురుచరణుడు.

"వారి కవసరమయితే అలాగే...."

గురుచరణుడేదో సమాధానం చెబుదామనుకుంటుంటే, అంతలో అన్నాకాళీ ప
గెత్తుకు వచ్చింది; "వదినా, శేఖర్‌దా నిన్ను దుస్తులు మార్చుకు రమ్మంటున్నాడు
జల్దీ! నాటకానికి వెళ్ళాలిట!" అని చెప్పి, ఎంత విసురుగా వచ్చిందో అం
విసురుగా వెళిపోయింది.

ఆపిల్ల హడావుడికి గురుచరణుడు నవ్వుకున్నాడు. లలిత అలానే కూర్చునివుం
"వెళ్ళమ్మా లలితా! ఆలస్యం చెయ్యకు. అందరూ నీకోసం కనిపెట్టుకు నుంటారు!
అన్నాడు గురుచరణుడు.

తప్పనిసరి అయింది లలితకు. వెళ్ళేముందు గిరీన్‌కేసి కృతజ్ఞతా పూర్వకమై
గంభీర దృష్టి బరపి, మెల్లగా వెళుతున్నదని అతడు గ్రహించాడు.

బట్టలూ అవీ మార్చుకుంది లలిత. తాంబూలమిద్దామనే మిషతో మళ్ళీ ఒకమా
బయట గదిలోకి వచ్చిద.

గిరీన్ వెళ్ళిపోయాడు. గురుచరణుడు ఒక్కడే ఉన్నాడు. చేరగిలి పడుకున్నాడ
మూసుకున్న అతని కొలకుల్లోంచి కన్నీటి ధారలు ప్రవహిస్తున్నాయి. అవి ఆనం
బాష్పాలని లలిత గ్రహించింది. అందుచేత, అతడికి ధ్యానభంగం కలిగించక
వచ్చింది వచ్చినట్టుగానే నిశ్శబ్దంగా వెళ్ళిపోయింది.

కాస్సేపటికల్లా ఆమె శేఖరుడి గదిలోకి వచ్చింది. ఇంకా కన్నీళ్లు జలజల్లా
తూనే వున్నాయి. కాళీ ముందుగానే పోయి బండిలో కూర్చుంది. లలితకోస
కాబోలు శేఖరుడొక్కడే ఎదురుచూస్తూ నిలబడివున్నాడు. అశ్రువులతో నిండి
ఆమె కళ్లు చూశాడు. లోగడ ఆమెపైన గల కోపమంతా మరిచిపోయి, "అదేమిట
ఏడుపెందుకూ?" అనడిగాడు, ఉద్వేగంతో.

లేదన్నట్టు తలవూగించి, వొంచుకుంది.

ఈమధ్యనల్లా లలిత దొత్తిగా కనిపించకపోయేసరికి అతడి మనస్సు మారిపోయ
సానుభూతి కలిగింది. దగ్గరగా వచ్చి, రెండుచేతులతో లలిత ముఖం పైకెత్త
"నిజంగానే ఏడుస్తున్నావా, ఏం జరిగిందేం?" అనడిగాడు.

ఇహ ఉండబట్టలేకపోయింది లలిత. అక్కడే చతికిలబడింది. చీర చెంగుతో
ముఖం కప్పేసుకుని బావురుమని ఏడ్చింది.

## 6

లౌకట్టు తాలూకు వడ్డీ తీసుకున్నా అసలీ పాయిదాలు దమ్మిడీలతో సహా లెక్క
కట్టాడు నవీన్‌రాయి. దస్తావేజు తిరిగి ఇచ్చేస్తూ "ఎవరిచ్చారోయ్ ఈ డబ్బూ?

సోమయ్య.

"అదేటి దొరా, యీ పెద్దెనకాల గుట్టమీదున్నాది. అదిగదే బంగలా. కొట్టిన దారేటీ నేదు"

"పోగలమా?" అన్నాడు చిన్నప్ప.

అందరూ బంగళాకి బయల్దేరారు. చిన్న గుట్టమీద విశాలమైన భాగం చదును చేసి వుంది. ముళ్ళ తుప్పలూ, అడివి మొక్కలూ ఇంటిచుట్టూ దట్టంగా పెరిగి వున్నాయి. ఇంటి తలుపులు ఎవరో పీకేసినట్టున్నారు. గుమ్మాలు సగంపైగా చెదలు తినేసో, ఊడిపోయో వున్నాయి. అక్కడక్కడా కిటికీలకు ఒక్కొక్క గాజు పెంకు వేలాడుతూంది కప్పు మీద మచ్చుకైనా ఒక్క పెంకులేదు.

"పెంకులన్నీ మాంకూ పట్టుకుపోయి వుంటాడు" అన్నాడు సోమయ్య.

"అమ్మో, యీ బంగలా సరుకు అంటుకోటవే?" అన్నాడు మాంకూ.

"నీ యింటికి పెంకులూ, కలపా ఎక్కణ్ణుంచి వచ్చినయ్యిరా?" మాంకూ ఇంటివైపు చూపించాడు సోమయ్య. వాళ్ళెక్కి వచ్చిన దారికి ఎడంగా అరటి చెట్ల మధ్య కనిపించింది. కూలీల యిళ్ళలాలేదు. కొంచెం పై అంతస్థుకి చెందినట్టుంది.

"వీడు కాంట్రాక్టరయ్యాక స్వయంగా కట్టుకున్నాడు" అన్నాడు సోమయ్య మళ్ళీ.

"రగతం వొడ్చి గడిచ్చిన సొమ్మెట్టి కట్టిచ్చీను" అన్నాడు మాంకూ. సోమయ్య పెద్ద నవ్వు నవ్వాడు.

కూలిపోయిన ముందు గుమ్మంలో నుంచీ చిన్నప్ప బంగళాలో ప్రవేశిం చాడు. తక్కినవాళ్ళు అనుసరించారు.

"పెద్ద బంగళా"

"మేంగిల్స్‌కి చాలా మంది పిల్ల లుండే వారట. అరుగు రనుకొంటాను. తలొక గదీ కట్టించి, అతిథుల కోసం ఇంకొకటి కట్టించాడు" అన్నాడు సోమయ్య.

"ఇది స్నానాల గదిలా వుంది." రెండో తెల్లబట్ట మనిషికి స్నానాల గది చూస్తే ప్రాణం లేచివచ్చింది. దాని పొడుగూ, వెడల్పూ, ఎత్తూ చూసి ఎన్ని మొజాయిక్ పెంకులు వెయ్యాలో ఒక్క నిముషంలో అంచనా వేసేశాడు.

"స్నానాల గదులూ, మొజాయిక్ పెంకులూ వుంటే నీ కింకేవీ అక్కర్లేదు" నవ్వాడు చిన్నప్ప.

మేనేజింగ్ డైరెక్టరు మెప్పు అతన్ని సంతోషంలో ముంచి ఎత్తింది.

"అన్నేళ్ళ క్రితంకూడా యింత విశాలంగా స్నానాల గదులు కట్టేరంటే నమ్మలేకుండా వున్నాను" అన్నాడు.

"దీంట్లో వేసిన తొట్టెలవీ చూస్తే మరీ ఆశ్చర్యపోదురేమో మీరు. ఇంగ్లీషు తయారీలో ప్రత్యేక రకాలవిపట" అన్నాడు సోమయ్య.






"సూత్తై కళ్లు జిగేల్మనేది. సవద్రం వశాన్ని ముంచేసిన్ని" అన్నాడు మాంకూ.

"ఆఁ!" తెల్లబట్ట మనిషి ప్రాణం కొట్టుకుపోయింది.

"అవును. మేంగళూర్ సముద్రంలో పారేయించేశాడు మేంగిల్స్" అన్నాడు సోమయ్య.

"ఎందుకు?"

"వాటికి గాలిదేవరు శాపం తగిలింది. మళ్ళీ పాత ఇంటికిపోతూ మేంగిల్స్ కొత్త బంగళా స్నానాల గదుల్లో తొట్టెలూ, షవర్లూ, అద్దాలూ, అప్పటికి తయారై వచ్చిన కొద్దిపాటి కుర్చీలూ, సోఫాలువంటి విలువైన సామాన్లూ రెండు రెండెడ్ల బళ్ళకేసి పట్టుకుపోదా మనుకున్నాడు. మొదటి బండి వంద గజాలు నడవకుండానే ఒక యెద్దు కూలిపోయి చచ్చిపోయింది. ఈ అపశకునంతో సామాన్లు ఎస్టేట్లో ఉండడానికి వల్లకాదు. దూరంగా పారెయ్యాలని గోల బయల్దేరింది."

"అమ్మెయ్యకపోయారా?" ఆడిగాడు తెల్లబట్ట మనిషి.

"అమ్మడంలాగే వుంది. పడిపోయిన బండిలో వస్తువులు తిరిగి బంగళాకి చేర వెయ్యడానికే ఎవ్వర్నీ ఒప్పించలేకపోయాడు మేంగిల్స్. ఎంత డబ్బాశ చూపించినా ఒక్క లారీ డ్రైవరూ, బండివాడూ బరువు తీసుకెళ్లి పారెయ్యడానికి ధైర్యం చెయ్యలేదు."

"పిగురుకి ఆ కిరస్తానీ బోట్లేసు తోలు

కెళ్లిండు. అల్లంతెత్తు కెరటం లెగిసిందంట ఆటిల్ని గిరాటేసేతలికి'' అంది పుచ్చుకున్నాడు మాంకూ.

''నిజంగా సముద్రంలో పారెయ్యలేదట గదా?'' అన్నాడు చిన్నప్ప. మాంకూ ఒకటి రెండు నిముషాలు సంకోచించాడు.

''ఏటో దొరా, నాకు తెల్దు. అడయ్యాన్నీ అట్టుకెల్లి యాపారవెట్టిండని యిక్కడోల్లు గుసగుసలాడుకునీ వోరు'' అన్నాడు.

''మీరెవరూ మళ్ళీ బట్లర్ని చూళ్లేదా?''

''ఏటిదికి? ఆడు బాగడిపోనాడంటా యేడుత్తా వుంటానికి ఆడముందోడ్నేటి నేను? సేవుంటే నిన్యూ సంపాదిచ్చాల.''

''వాడు డబ్బు గడించిన విషయం నిజమేనన్నమాట'' అన్నాడు సోమయ్య.

''అదేవో, నాకెట్టా తెలుస్తది? ఎట్టా గడించిండో, ఏపాటి గడించిండో నేనాడికాడికి పోలేదు, ఆడ్నాకు సెప్పనేదు. ఈ కుసుద్దపు యెదవలు కూసిందే. ఆ యెవకాల ఆడింకా పెద్దోడయి పోయిందంటూ యేడిసీవోరు. తెలకడుగుతాను దొరా. పుంజీడు పింగానీ సిప్ప లిచ్చుకుని లచ్చలు గడిచ్చటానికి. ఆడిసేతిలో మాయ మంతరం వుండేటి?''

''పింగాణీ చిప్పలా? వాటి విలువ మీకు తెలిసినట్టులేదు'' తెల్లబట్ట మనిషి మనస్సు చివుక్కుమంది.

''పోన్లే. మాంకూకి మనం ఇప్పుడు ఉద్యోగం యివ్వటంలేదుగా. వాటిగురించి బోధించవక్కర్లేదు'' నవ్వాడు చిన్నప్ప.

''మీరు ఉద్యోగం ఇస్తానంటేమటుకు వస్తాడేవిటి వాడు?'' అన్నాడు సోమయ్య.

''దొర్లకి మునలోడ్నిసూత్తే ఆసికంగా వున్నాది. వొచ్చే పాణం, పోయే పాణం గాల్దేవురి పాదాలకాడ వగ్గేయాలిసిందే'' అన్నాడు మాంకూ.

''చూశారా, వాడికిక్కడ కొండంత వ్యాపారం వుంటే, ఒదులుకుని మీ దగ్గరికెలా రాగలడు?'' అన్నాడు సోమయ్య.

''ఒద్దులే మాంకూ, మేం పట్టుబట్టడం లేదులే'' అన్నాడు చిన్నప్ప.

''అంతేసి ఊసులాడమాకండి దొరా'' మాంకూ చేతులు జోడించి చిన్నప్పకి దణ్ణం పెట్టాడు.

స్నానాలగదినుంచి బయట వరండా మీదకి, అక్కణ్ణుంచి బంగళా వెనక భాగంలోకి కదిలారంతా.

''దిట్టమైన కట్టడం'' అన్నాడు తెల్లబట్ట మనిషి.

''కలకాలం వుండాలని కట్టించింది కాని, ఇలా అవుతుందనుకో లేదుగా'' అన్నాడు సోమయ్య.

''మేంగిల్స్‌ని భయపెట్టింది బట్లరే నట?'' మాంకూవైపు తిరిగి చిన్నప్ప అడిగాడు.




"ఆడేం సేసిందు?" అన్నాడు మాంకూ. "దొర బంగలా యిడిసిపెట్టి యెల్లిపోతంచే బెయం వొద్దంటా వొరె ట్టిందు. ఆ మారాజింటేనా? ఆతలికే ఆరి గుండి బేజారెత్తి పోనాది. ఈ యెదవ వొంవొలా యేడిసిందు."

"తమాషాలన్నీ అతనేచేసి దేవరు మహత్త్యం అని మేంగిల్స్‌ని నమ్మించా లంటారే?" అన్నాడు చిన్నప్ప మళ్ళీ.

"అదేటి సాబువు. గుర్రాల్దొర సేసింది తప్పయి దేవొరు కాగ్గరం వొత్తేసి."

"కనిపించిన వాణ్ణంతా అల్లరిపెట్టి ఏడిపించడం అతనికి సరదా అటగదా?"

"ఆడికాగొవం వున్నది. ఓ పాలియేటి సేసిందూ, మా యింటిది అమ్మోరుకి కోడిపెట్ట కోసెట్టింది. పూనకం అంటా యీడొచ్చి తలకాయకాణ్ణుంచి సాంతం బొంచేసిపోయిందు."

చిన్నప్ప నవ్వాడు.

"మేంగిల్స్‌నికూడా ఒక ఆట ఆడిం చాడని చెప్తారు" అన్నాడు.

"అబద్ధం, ఎవొరుదొరా సెప్పేది? ఈ తోట్లో ఒక్క గాడిదికొడుకుని సెప్ప మనండి సూత్తా. వాలిక పీలిపోద్ది" అన్నాడు మాంకూ.

"మరి మేంగిల్స్ తాగుతున్న గ్లాసు తీసేసి మాయమైపోయిందని పుకారు పుట్టించలేదూ?" అన్నాడు చిన్నప్ప.

"అది సత్తెవేదొరా" మాంకూ ఒప్పు కొన్నాడు.

"నిజంగానా? ఏం జరిగింది?" అత్యా

తగా అడిగారు సోమయ్య.

"ఆయాల దొర పీకాగ్గా ఎగిరిపడ తండారు. పెయ్యేరిగి కట్టేప్కువి అను వత్తిరివించి వత్తానే పిచ్చే ద్నాగా యిల్లంతా గాలిచ్చేత్తా గళానుమీద గళాను యిస్కీ ఎక్కిచ్చేత్తండారు. ఆతలికి కూలోల్లం సూట్టానికెల్లాం. ఎట్టాగినా. వొంచెల్లు ఆకాడ్నించి తప్పిచ్చెయ్యటానికి ఒప్పించాలా అని."

"వంటిల్లు మార్చడవెందుకు. నీళ్లు గుడిదగ్గిరకి పోకుండా చెయ్యరేరా?" తెల్లబట్ట మనిషికి సందేహం వచ్చింది.

"బెమ్మాండవేటిగాని. కొందవాటం అట్టాగున్నాది. సిమ్మెంటూ, సున్నమూ యేపి కట్టిచ్చిన తూవు యిరగ్గొట్టనంటా వంతంపట్టి కూసున్నాడు దొర. మాయన్ని తెలివితక్కువ నమ్మకాలంటా కూకలేసిండు."

"తరవాతేవయిందో చెప్పు" తొందర పెట్టేడు సోమయ్య.

"ఏటవుద్ది. మైకంవులో వున్నాడేమో. సూట్టాని కిల్లేదని గసిరి పొమ్మనేసిండు. కూలోల్లం ఒగ్గనేదు. ఇసురుగా వచ్చి మీద పడిపోయిండు. నోపల బొట్లేరూ, వంటోడూ దొర యిడిసేసిన కొంత యిస్కీవుంటే, తాగేసిన్రు. దొర తాగటం అయిపోనాదని ఆల్లబ్రెమ. ఆనాకా దొర కూకలేత్తే బొట్లేరు బెయంపడిపోనాడు. ఆడికి తెలవదంటా బొంకిండు. వంటోడూ అట్టానే బుకాయించిండు. పొద్దు పొడిసే యేలకి దొర తాగి గలాసు గాల్దేవరు మగాత్మ్యం మాయవయిందంటా వోర్త గుప్పుమన్నాది."

"నిజం బయటపడకుండా వుందా?" అన్నాడు తెల్లబట్ట మనిషి. ఏ విషయాన్నీ తర్కించకుండా నమ్మడం అతని కలవాట్లేదు.

"మాలాటోల్లు వలుగురి సెవులుకాడి కెట్టాగో వత్తాది. కూలోల్లందరికీ యెట్టా తెలత్తాదీ? ఆ యెరివ లిద్దరూ ఆడల్తా వొపికిపోతండారు గందా నోరిప్పుతారో యేవో."

"ఒకళ్ళకి తెలుత్తే అందరికీ తెలిపి వట్టే" అన్నాడు తెల్లబట్ట మనిషి.

"గుర్రాల్దొర మాత్తరం నమ్మేరేటి? మోసవయి పోనాదంటా కాన్నాల్లు సీద రిచ్చుకుపివోరు. కదం మగెత్తాల సందట్లో యిదీ కమ్ముకుపోనాది" అన్నాడు మాంకూ.

"తక్కిన నాటకం కూడా బట్టరాదిందే నట" అన్నాడు చిన్నప్ప.

"మీ కిదంతా ఎలా తెలుసుమ?" అడిగాడు సోమయ్య.

"విన్నాను" అన్నాడు చిన్నప్ప.

తను విన్నది చెప్పాడు.

గాళిదేవరు మహిమవల్ల విస్కీగ్లాసు మాయమయిందని మేంగిల్స్ నమ్మని మాట నిజమే. ఇది జరిగిన మర్నాడే




జంగళా ఆవరణలో పెద్దచెట్టు విరిగిపడి అతని పెంపుడు కుక్క చచ్చిపోయింది. దీంతో మేంగిల్స్ మనస్సు కలవరపడడం మొదలు పెట్టింది. దానికితోడు కూలీల గోల. అయినా జడిసినట్టు ఎవరికీ తెలియకుండా వుండాలని చాలా ప్రయత్నించాడు. ప్రతిపనిలోనూ అధైర్యం, అపోహ, భయం కమ్ముకువచ్చేవి. వింతగా ప్రవర్తించేవాడు. యజమాని నిర్బలత్వాన్ని చూస్తే బట్లరుకి నవ్వాగేది కాదు. దొర పిరికితనాన్ని అసరాగా తీసుకుని అల్లరిపెట్టి వినోదించకుండా వుండలేకపోయాడు. భోజనసమయంలో వాయికి పళ్ళెలు మార్చేటప్పుడు వీలు చూసుకొని అన్నం పళ్ళెం మార్చేసి వేర్పుగా రాళ్ళు పెట్టిన పళ్లెం యిరికించేవాడు. మేంగిల్స్ పడకగది డ్రాయర్లో దాచుకున్న మారుతాళం తీసి, గరాజ్ పై కప్పునుంచీ లోపలికి దిగి కారు స్టార్టు చేసి, హారను వాయించి పారిపోయేవాడు. ఇంకా ఇటువంటివే ఎన్నో. మేంగిల్స్ కంగారుపడుతుంటే, యితనికి ఆటగా వుండేది. తమాషాల్ని నిజం అని నమ్మించగలిగానని మురిసిపోయేవాడు. అయితే, అవి వింత పరిణామాలకి దారి తీస్తాయనుకోలేదు. అంతా జరిగిపోయిం తరువాత చెప్పడానికి ధైర్యం చాల్లేదు.

“దొర పెదతాపుటే నమ్మదానికీ ల్లేకంటా సిత్తరంగా వున్నాది” అన్నాడు మాంకూ.

“నాకు అలాగే అనిపిస్తుంది” అన్నాడు సోమయ్య.

కొంతసేపు జీపులో తిప్పి ఎస్టేటు చూపించి, గాళిదేవరు దర్శనం చేయించి ఛోటా విస్కీకీ, కులాసా కబుర్లకీ తిరిగి అతిధుల్ని బంగళాకి తీసుకుపోదామను కున్న సోమయ్య తను ఊహించలేని విషయాల ఒత్తిడికి తట్టుకోలేక పోయాడు.

"వంటిల్లెటువైపు?" అన్నాడు చిన్నప్ప. అప్పటికే యిల్లంతా కలయ జూసి చదరపు గజాలూ, ఘనపరిమాణాలూ లెక్కకట్టిన తెల్లబట్టమనిషి "ఈ చివర" అంటూ దారి తీశాడు. చిన్నప్ప వంటగదిలో ప్రవేశించి. పాత్రలు కడిగే తొట్టిని పరీక్షించడం ప్రారంభించాడు. తొట్టి సిమ్మెంటు చాలావరకూ పగిలి పోయి వుంది. లోపల ఇటికలుకూడా మూడు వంతులు కరిగిపోయాయి. మీద ఒకప్పుడు కొళాయి వుండేదనడానికి ఆన వాలుగా విరిగిపోయిన రేకుముక్కలు ఇక్కడా అక్కడా గోడకి అంటిపెట్టుకుని వున్నాయి. తొట్టికింద నీళ్ళు పోడానికి చేసిన కన్నం పూర్తిగా పూడుకు పోయింది. నేల మీద పడున్న ఒక పుల్లని తీసి కన్నం కెలికాడు చిన్నప్ప.

"ఇక్కణ్ణుంచేనా నీళ్ళు గాళిదేవరు విగ్రహం దగ్గరకి పోయేది?" అన్నాడు మాంకూని చూసి.

"అవును."

వంటగది బయటికివచ్చి సిమ్మెంటు కాలవకోసం చూశాడు చిన్నప్ప. గడ్డీ మట్టీతో కప్పబడిపోయి వుంది. ఇక్కడా అక్కడా కొంతరాయి బయటికి కని పిస్తూంది. దాని వారన కాలిజోడుతో కొట్టి వర్షాలకి మెత్తబడిన కొంతమట్టిని పైకి లాగాడు.

"ఆకత్తితో కాస్త పొడు మాంకూ" అన్నాడు.

మాంకూ మట్టి దిళ్ళల్ని పెళ్ళగించ డానికి ఉపక్రమించాడు. సోమయ్య కేమీ అర్థం కాలేదు. కూడా తీసుకువచ్చిన కర్రతో తనూ కాలవ శుభ్రం చెయ్యడం మొదలు పెట్టాడు.

"ఇక్కడ చూడు మాంకూ" అన్నాడు చిన్నప్ప ఉత్సాహంగా. మాంకూ వెనక్కి తిరిగాడు. సిమెంటు కాలవ అక్కడ కొట్టేసివుంది. ఆపైన నీళ్ళుపోకుండా రాళ్లు ఒకదానిమీద ఒకటి పేర్చివున్నాయి. అక్కణ్ణుంచి మలుపు తిరిగి కొండకి రెండవవైపు నీళ్ళు పారడానికి కట్టిన సన్నకాలువ అనవాళ్లు చూచాయగా కని పిస్తున్నాయి. "ఈ కాలవ యెక్కడికి పోతుంది మాంకూ?" అన్నాడు చిన్నప్ప.

మాంకూ ముసలి కళ్ళు మిలమిలా మెరిసాయి. చిన్నప్పని పరిశీలించి చూశాడు.

"ఏం మాంకూ" అన్నాడు చిన్నప్ప మళ్ళీ.

"దొర్లకి తెలీని యినయమేటి?"

ఆ పక్కనే తవ్విన గోతిలో దిగి వుంచున్నాడు మాంకూ.

"ఇక్కడికి" అన్నాడు.

అతను లోపల నుంచోకపోతే అది గొయ్యని తెలియడం కష్టం. కలుపు మోకాళ్ళదాకా మాంకూని కప్పేసింది.

సోమయ్యకి చెప్పలేనంత ఆశ్చర్యం వేసింది. చరచరా గొయ్యి దగ్గిరకి వెళ్లాడు.

"వంటింట్లో నీళ్ల విగ్రహం దగ్గిరికి వెళ్ళవే లేదన్నమాట!" అన్నాడు.

మాంకూ వున్న పళ్ళన్నీ బయటపెట్టి నవ్వాడు.

"అంతా తెలుసుండే దాచిపెట్టేవురా!" ఉరిమాడు సోమయ్య.

"నేదుదొరా" అన్నాడు మాంకూ.

"ఇంకా అబద్ధాలే. వెధవా!"

"నత్తెందొరా. ఆడుపోయేతలికి నాకు తెల్దు" అన్నాడు మాంకూ.

"ఎవరు?"

"అదే. కిరస్తానీ బొట్లేరు."

"వాడు తవ్వేడా ఈ గొయ్యి?"

"ఆదేమరి. వంటింట్లో అయ్యా. ఇయ్యా కడిగివోడాదేగందా" అన్నాడు మాంకూ.

"వాడెళ్లిపోయింతరవాత తెలిసిందని దొరతో చెప్పడం మానేస్తా వట్టా శాస్కెల్....స్కౌంట్రల్...."

సోమయ్య తిట్లతో గుక్క తిప్పుకోలేక ఉక్కిరి బిక్కిరయ్యాడు. అది మాంకూ వ్యక్తిగత సంబంధమైన విషయం అన్న తలపు అతనికి రాలేదు. జరిగింది ఎన్నో ఏళ్ల క్రితం అనీ, తనకి పరిచయమైనా లేని మేంగిల్ఫ్ కనీ, దాని వల్ల తనకేనష్టమూ కలగలేదనీ కూడా అనిపించలేదు. కింద పనిచేసే కూలీమీద ఎస్టేట్లు నడిపే దొరల పక్షాన్న అతడు రౌద్రుడై పోయాడు.

"దొర్లు కోంపడమాకండి" అన్నాడు మాంకూ. "గాల్దేవరు వూసు సెప్పు కుంటా బతికీయెదవని."

"మాంకూ" పిలిచాడు చిన్నప్ప. అతని గొంతులో మార్దవం ఆవరించింది.

మాంకూ తలెత్తి చూశాడు.

"నీ గురించి మా తాత నా కెందుకు చెప్పలేదో తెలియడంలేదు" అన్నాడు.

"ఏటిదొరా! తవురనీది. తాతా?" ఆశ్చర్యపోయాడు మాంకూ.

"అవును చిన్నప్ప."

"కిరస్తానీ బొట్లేరు."

ఆప్యాయంగా పంఖోనీ చిన్నప్ప దగ్గిరకివెళ్లి ఒళ్లు నిమిరిచూశాడు మాంకూ. నచ్చినట్టు తృప్తిగా కనుబొమ ఎగరేసి బుర్ర ఆడించాడు. ఆ సాన్నిహిత్యానికి అతనిలో విగ్రహం కట్టలు తెంచుకుంది. గట్టిగా నవ్వాడు ఆనవ్వు పెద్దదై ఇంకా పెద్దదై లోయ మారుమోగింది. వారించాలని ఎవరికీ తోచలేదు.

---

# అతనంటే నాకు ప్రాణం. అతన్తో ఎట్లా చెప్పేది?

నెల రోజుల క్రితం, ఇల్లాలిని, ఆఫీసుకైనా సరే, రమేష్ బయటకు వెళ్లిన పుండేనే రాదని దుర్భరంగా ఉండేది. ఇప్పుడు, అతని నోటి దుర్వాసన వల్ల, అతనికి దగ్గర్లో ఉండటమే సహించ లేక పోతోంది.
















ఆమెకు తప్పకుండా తెలుసు. బినాకా గ్రీన్ వారిని ఒకరి కొకరికి అత్యంత సన్నిహితులుగా చేసింది.




Binaca
Green

రోజంతా, మీ శ్వాసను తాజాగా మధురంగా ఉంచగల, ప్రకృతి యొక్క స్వకీయ దుర్గంధ నివారిణి క్లోరోఫిల్ బినాకా గ్రీన్‌లో గలదు.

C I B A Cosmetics

mcm/cg/13a te

మార్చి నెల

# భావపరిచయ పోటీ

బహుమానం రూ. 10—00



ఈ కార్టూనుకు హాస్యయుత వ్యాఖ్య (Caption) కావాలి.

వ్యాఖ్య వచనంగా గానీ, పద్యంగా గానీ వుండవచ్చు. వచనంగా అయితే ఒక్క వాక్యంలోనూ, పద్యంగా అయితే నాలుగు పాదాల లోపుగాను వుండాలి.

వ్యాఖ్య కార్డుపైననే వ్రాసిపంపాలి. కవరులోపంపినవి అంగీకరింపబడవు.

మాకుచేరిన వ్యాఖ్యలలోకెల్లా ఉత్తమంగా వున్నదానికే బహుమాన మివ్వబడును. బహుమతి నిర్ణయంలో సంపాదకునిదే తుదినిర్ణయం. ఉత్తర ప్రత్యుత్తరాలు లేవు.

వ్యాఖ్యలు మాకు ఫిబ్రవరి 5 వ తేదీలోగా చేరాలి. యువ పాఠకులందరూ ఈ పోటీలో పాల్గొన వచ్చును. ప్రవేశరుసుములేదు.




# తప్పటడుగు

సోమేశ్వర

(గత సంచిక తరువాయి)

"కాని పెళ్ళిమాత్రం చేసుకోవంటారు అంతేగా? అదే ఎందుకూ అంటాను...." అతని కళ్ళలోకి తీక్షణంగా చూస్తూ అంది మెహర్.

"ఇంకా వివరంగా చెప్పాలా? మన వివాహం చట్టబద్ధం కాదు." తల వంచుకునే సమాధానమిచ్చేడు రవీంద్ర.

"అదే, ఎందుకూ అంట? మన వివాహం చట్ట బద్ధం కాకపోవటానికి కారణం యేమిటి? మత ప్రమేయంలేని మన రాజ్యాంగంలో మన వివాహానికి అడ్డు తగిలే అంశ మేమిటి?" ఉద్రేకంతో వణికి పోతోంది మెహర్.

"నీకు తెలియదా మెహర్? నేను వివాహితుడిని నాకు ముగ్గురుపిల్లలు..."

"డా—కర్! ఏ....మిటి....మీరంటున్నది....? మీరు .... మీరు .... వివాహితు....లా? దుర్మా . .ర్గుడా—? నువ్వు.. నువ్వు....నన్ను...." అంటూ ఒక్కసారిగా స్పృహతప్పి విరుచుకు పడింది మెహర్. నేల మీద నిర్జీవంగా పడి ఉన్న మెహర్‌ని చూస్తూనే కంగారు పడ్డాడు మొదట రవీంద్ర

తరువాత వెంటనే పక్కనే ఉన్న కూజాలోని నీళ్లు తెచ్చి ఆమె ముఖంమీద చల్లేడు.

ఇంతలో "బేటీ, మెహర్! ఏం చేస్తున్నావు?" అంటూ గదిలోకి వచ్చిన తాహెరా బేగమ్ ఆ దృశ్యాన్ని చూస్తూనే విశ్చేష్టురాలయింది.

"అయ్యో! డాక్టర్ సాబ్ నా బిడ్డకేమయింది?" అంటూ పరుగెత్తుకు వచ్చి

కూతురుని ఒడిలోకి తీసుకుంది తాహెరా.

"ఏంలేదు. ఎందుకో చాలా బలహీనంగా వుంది. రాత్రిళ్లు అతిగా చదువుతున్నట్లుంది. మనిషి చాలా నీరసంగా ఉంది. మాట్లాడుతూన్నదల్లా ఉన్నట్లుండి ఫిట్ వచ్చినట్లు పడిపోయింది...." అన్నాడు తడబడుతూ రవీంద్ర. ఇంతలో ఆ వార్త తెలిసి యింట్లో వాళ్ళంతా వచ్చేరు. మెహర్‌ని లేవనెత్తి పక్కమీద పడుకోబెట్టేరు.

"దగ్గర మీరుండబట్టి సరిపోయింది. లేకపోతే ఏ బల్లో, కుర్చీయో తగిలితే—" అంది తాహెరా.

రవీంద్ర తలవంచుకున్నాడు.

"డాక్టర్ సాబ్! ఎందుకిలా అయిందంటారు?" ఆత్రంగా అడిగేడు గఫర్‌ఖాన్.

"మరేం కంగారు పడకండి. అదేం పెద్ద జబ్బుకాదు. నరాల బలహీనత వల్ల అప్పుడప్పుడు ఆడవాళ్ళకి అలాగే వస్తుంటయ్." అన్నాడు రవీంద్ర.

"మా బంధువుల్లో ఓ పిల్లకి పెళ్ళి కాక ముందిలాగే ఫిట్స్ వచ్చేవిట. పెళ్ళైనా, పిల్లలు పుట్టగానే అన్నీ పోయినయ్. అలాటి జబ్బేం కాదుగా?" అంది తాహెరా

"వచ్చే వేసవిలోనే మనమ్మాయి పెళ్ళి చేసేస్తాం కదా. నీకా భయమెందుకు?" అన్నాడు గఫర్‌ఖాన్. భార్య వంకచూసి నవ్వుతూ.

"ఐతే రేపే ఉత్తరం వ్రాయండి. నెల రోజుల్లో ప్రధానం పెట్టుకోవటానికి రమ్మని మా చెల్లెలికి." అంది తాహెరా.

"సర్లే! ఆ కబుర్లన్నీ యిప్పుడెందుకు? పిల్ల ఎలా ఉందో చూడు." అన్నాడు గఫర్‌ఖాన్.

మెహర్‌కి అప్పటికి స్పృహ వచ్చింది. వళ్ళంతా నిస్సత్తువగా ఉన్నప్పటికీ మనిషి తెలివిలోనే ఉంది. వాళ్ళందరి మాటలూ వింటూ నిర్లిప్తంగా ఎటో చూస్తూ కళ్లు తెరుచుకునే పడుకుంది.

"అమ్మా! కాసిని నీళ్లు తాగుతావా?" అంది తాహెరా.

వద్దన్నట్లు తలూపింది మెహర్.

రవీంద్ర కాగితంమీద మందు వ్రాసిచ్చి "యీ మాత్రను యీ రాత్రికి వేసుకోమనండి. హాయిగా నిద్ర పడుతుంది. రేపు ఉదయానికల్లా మామూలుగా లేచి తిరుగుతుంది." అన్నాడు. మరో అరగంట గందరగోళంలో, ఆదరవులో, ఆత్రుతలో గడచిపోయింది.

"ఇంక నేను వెళ్తాను. మీరేం భయపడకండి" అని గఫర్‌ఖాన్ వాళ్ళందరికి నచ్చ చెప్పేడు రవీంద్ర. తరువాత మెహర్ దగ్గరకి వెళ్ళి ఎడమచేత్తో ఆమె తలవెంట్రుకలను నిమురుతూ "అనవసరంగా ఆవేశపడకు. లేనిపోని ఆలోచనలతో మనసు పాడుచేసుకోకు. నిన్ను బాధ పెట్టినట్లయితే నన్ను క్షమించు. ఇంక

ఎన్నడూ నీ జీవితంలోకి ప్రవేశించను. గుడ్‌బై" అంటూ గుసగుసగా చెప్పేరు.

రవీంద్రతోపాటు, ఆతనివి సాగ నంపటానికి మిగిలినవారుకూడా గదిలో నుండి బయటికి వెళ్ళేసరికి ఒంటరిగా మిగిలిన మెహర్ "భగవాన్! ఈ దుఃఖానికి తట్టుకునే శక్తిని నాకు ప్రసాదించు ప్రభూ!" అంటూ వెక్కి వెక్కి ఏడ్చింది.

మర్నాడు మామూలుగానే తెల్లవారింది. కాని నిద్రమాత్ర సహాయంతో కలత నిదుర పోయా. మేలుకున్న మెహర్ మనసులో మాత్రం నల్లని చీకటి ఆవరించి ఉంది. సూర్యకిరణాలు తీక్షణమౌతూ ప్రపంచాన్నంతటినీ కాంతితో నింపుతున్న కొలదీ ఆమె హృదయంలోని విషాదాంధకారం దట్టమౌతూ వచ్చింది.

తన తొలిప్రేమ భగ్నమయింది. తన గుండెను తూట్లు పడినయ్. తన ప్రేమ, మతాల పరిధులను దాటి ప్రవహించ గలిగిన తన ప్రేమ—బూడిదలో పోసిన పన్నీరయింది ఇక తాను ఎందుకు జీవించాలి? ఎవరికోసం జీవించాలి?

ఆ రోజుతో రంజాన్ నెల ప్రారంభమౌతుంది. ఇంట్లో అందరూ ఉపవాసం ఉంటున్నారు తన ఆరోగ్యం బాగా లేనందున ఉపవాసం ఉండవద్దని ఇంట్లో అందరూ ఎంతగా బతిమాలినా మెహర్ వినలేదు. ఆమెకూడా ఆ ఉదయమంతా ఉపవాసం ఉంది. పచ్చి మంచినీళ్ళయినా త్రాగకుండా, కనీసం ముఖమైనా కడుక్కోకుండా సాయంత్రం ఆరుగంటలవరకు అలాగే ఉంది మెహర్. ప్రతి రంజాన్ నెలా అలా ఉపవాసం ఉన్న సమయంలో భగవద్ధ్యానం చేసేది మెహర్.

కాని యీరోజు మాత్రం ఆమె మనసంతా శూన్యంగా ఉంది. జీవనోద్యానవనంలో సంపెంగ చెట్టువంటిది ప్రేమ. ఆ చెట్టు ఎక్కడున్నా ఏ మూల మొలిచినా తోటనంతటినీ మధుర సౌరభాలతో ముంచి యెత్తుతుంది. పూల వాసనలలో ఎన్నో రకాలున్నయ్ కాని తియ్యగా, మత్తుగా, బరువుగా ఉండే సంపెంగ వాసనకు పాటియైన పుష్పసౌరభం మరొకటి లేదు. అలాగే జీవితంలో ఎన్నిరకాల అనుబంధా లేర్పడినప్పటికీ ఉద్విగ్నమూ, మధురాతి మధురమూ, అనుభవైకవేద్యమూ అయిన ప్రణయానికి సాటియైన అనుబంధం మరేదీ లేదు.

అన్ని తోటలలోనూ సంపెంగ చెట్లుండక పోవచ్చు. అందరి జీవితాలలోనూ ప్రణయభావానికి తావులేక పోవచ్చు. కాని ఒకసారి ఆ పరిమళాన్ని ఆఘ్రాణించిన తరువాత, ఆ పువ్వు నశించినా, ఆ పరిమళం మాత్రం మనోద్యానవనంలో మధురంగా గుబాళిస్తూనే ఉంటుంది.

మెహర్‌యొక్క ప్రణయానికి ఆధారమైన రవీంద్ర తన జీవితంనుండి నిష్క్రమించినా, అతను విదజల్లిన ప్రణయసౌరభం మాత్రం ఆమెను వదలటం

లేదు. ఆ పరిమళం యిప్పటికీ ఆమె మనసును పరవశింపజేస్తూనే ఉంది.

రంజాన్ నెలంతా అలాగే గడచిపోయింది. భగవంతుడికి బదులు రవీంద్రనే మనసులో ధ్యానిస్తూ యోగావస్థలో ఉండిపోయింది మెహర్. ఒకరకంగా చెప్పాలంటే ఆ నెలరోజులూ ఆమె తపస్సు చేస్తోంది. ప్రణయ సాక్షాత్కారం కోసం ఆమె మనసు పరితపిస్తోంది.

ఆ నెలరోజుల అనుభవంలోనూ ఆమెకు తెలిసివచ్చిన విషయం యేమంటే తను రవీంద్రను మర్చిపోవటం అసంభవమన్న విషయం. రవీంద్రను తను గాఢంగా ప్రేమించింది. అతనిని అతనిగానే ప్రేమించింది. మతాలకీ, సాంఘిక వ్యవస్థకీ అన్నిటికీ అతీతంగా అతనిని ప్రేమించే శక్తి తనకి ఉన్నది. ప్రేమకు కారణాలు లేవు. ఫలితాలతో ప్రేమకి సంబంధం లేదు.

రవీంద్రను తను మర్చిపోలేదు. రవీంద్రను ప్రేమించకుండా తను జీవించలేదు. ప్రేమ అనే భావం తన రక్త ప్రవాహంలో పూర్తిగా జీర్ణించుకుపోయింది. ఈ ప్రేమభావం నశించిందంటే రక్తప్రసారమే ఆగిపోవచ్చు.

మర్నాటితో రంజాన్ నెల ముగుస్తుంది. మహమ్మదీయు లందరూ ఎంతో వేడుకగా జరుపుకునే పెద్ద పండుగ రంజాన్. ఇలాటి శుభ సమయంలో తన జీవితాన్ని గూర్చి ఒక నిర్దిష్టమైన ఉద్దేశ్యాన్ని కల్పించుకోవాలనీ, తన జీవన వీణను శృతి చెయ్యాలనీ భావించింది మెహర్.

తనిప్పుడు చేసుకొనబోయే నిశ్చయం పైననే తన భావి జీవితమంతా ఆధారపడి ఉంటుంది. రవీంద్ర హిందువు. అతను వివాహితుడు. ముగ్గురు పిల్లల తండ్రి. అతనితోటి ప్రేమను పూర్తిగా మర్చిపోయి బీయెస్సీ ముగించుకుని పాషాని పెళ్లాడి, జీవితాన్ని సాఫీగా, సుఖవంతంగా చేసుకోవాలి. లేదా రవీంద్ర ప్రేమలోపడి, అతిక్లిష్టమైన పరిస్థితుల నధిగమించి అతని కౌగిలిలో శాశ్వతంగా ఉండిపోవాలి.

ఇందులో తనకేది దారి?

ఖురాన్ చెప్తుంది ఒక చోట. ప్రతి మనిషి జీవితం అతని జీవిత కాలంలోని ఒకే ఒక్క క్షణం మీద ఆధారపడి ఉంటుందిట. ఆ క్షణంలో ఆ మనిషి చేసుకున్న నిర్ణయాన్ని బట్టి అతని జీవన విధానం ఉంటుందిట. ఆ ఒక్క క్షణాన్ని వినియోగించుకుని తన జీవితాన్ని తాను ఏర్పరచుకునే అవకాశాన్ని భగవంతుడు మానవుడికి ప్రసాదించేడట.

మెహర్ నెలరోజులుగా ఆలోచించి, ఆలోచించి చివరికి తన జీవితంలోని ముఖ్యమైన సమస్యకు పరిష్కారాన్ని నిర్ణయించుకుంది. పాషాతోటి వివాహం. ఆ తరువాత అతనితో గడిపే జీవితం మెహర్ కంటికి ఎంతో విస్పారంగా,

భారంగా తోచింది. అందరిలాగా తాను జీవించకూడదు. మామూలు స్త్రీలాగా పెద్దలు నిర్ణయించిన వరుడిని వివాహ మాడి, పిల్లలను కని అనామకంగా, అనార్ద్రంగా జీవించటం తనకిష్టంలేదు.

తన స్వభావానికి అలాటి జీవితం సరి పడదు. తనకి జీవితంలో ఒక ఉత్తేజం ఉండాలి. ఒక ఆకర్షణ ఉండాలి. ఆనందం ఉండాలి. ఇవన్నీ అందివ్వగల శక్తి రవీంద్రకి ఉంది. అందుకే తను రవీం ద్రను ప్రేమించకుండా ఉండలేక పోతోంది. అతను కావాలని తన మనసు పదేపదే కాంక్షిస్తోంది.

జ్వాజ్వల్యమానంగా ప్రకాశించే రవీంద్ర కోటి సాహచర్యమనే మంటవైపుకు శల భంలా ఆకర్షింపబడుతోంది ఆమె మనసు.

జీవితమో, మృత్యువో ఏదో ఒకటి రవీంద్రవల్లనే. రవీంద్రతోనే గడచి పోవాలి అని గట్టిగా నిశ్చయించుకుంది మెహర్.

సరీగ్గా అదే సమయానికి రవీంద్ర కారు డ్రైవరు ఒక చీటీని తెచ్చి ఆమె కిచ్చేడు. "డాక్టర్ బాబు మీ కిమ్మన్నా" రంటూ. అహమ్మద్ యింట్లో లేడు. మిగిలినవాళ్లెవరికీ ఇంగ్లీషు చదవటం రాదు. వణుకుతున్న చేతులతో ఆ ఉత్త రాన్ని చదివింది మెహర్. ముచ్చట గొలిపే ముత్యాలసరాలవంటి ఇంగ్లీషు అక్షరాలతో రవీంద్ర వ్రాసిన లేఖ అది. దాని భావం యిది.

"ఓ నా మధురాతి మధురమైన దేవతా! నిన్నిలా సంబోధించుతున్నం దుకు నన్ను మన్నించు. నా మనసు నేను చెప్పినట్లు వినటం లేదు. ఎంత ప్రయ త్నించినప్పటికీ నీ మీది అనురాగాన్ని త్రుంచివేయలేక పోతున్నాను. నీతో గడపిన మధుర క్షణాలను మరచిపోలేక పోతున్నాను. ధర్మమో, అధర్మమో నాకైతే తెలియదు. నేను నీ దాసుడను. నీ కోమలమైన చరణస్పర్శ లభించినను అంతే చాలునని మురిసిపోయే భక్తుడను. ఎన్ని జన్మలకైనా నీ నామమే స్మరిస్తూ, నీ కోసమే జీవించే—

నిర్భాగ్యుడు
రవీంద్ర."

ఉత్తరం యిచ్చినతను బయటనే నిల్చున్నాడు. చదవటం పూర్తయినాక గుండె చిక్కబట్టుకుని, తన గదిలోనుండి బయటకు వచ్చింది మెహర్. ఆమె కెదురైన తల్లి "డాక్టర్ సాబ్ ఏం వ్రాసేడే?" అనడిగింది.

"రేపు రంజాన్ కదూ? మనింటికి వద్దామనుకుంటున్నాడట. రమ్మంటారా? అని అడుగుతున్నాడు డాక్టర్." అతి కష్టంమీద నవ్వుతూ అంది మెహర్.

"అదేం మాట? రమ్మంటారా అని అడగటమేమిటి? ఆయన మనకేం పరాయి వాడు కాదు. నా బిడ్డలాటివాడు. అహ మ్మద్ యెంతో రవీంద్రకూడా అంతే! వీలైతే భార్యనీ పిల్లలనుకూడా తీసుకు

తమ్మను" అంటూ డ్రైవరుతో చెప్పింది తాహెరా.

మెహర్‌కి తల్లిమాటలు వింటుంటే దుఃఖం ఆగలేదు. వెంటనే తన గదిలోకి పరుగెత్తుకుపోయి మంచంమీద బోర్లా పడుకుంది. "ఐతే అమ్మావాళ్ళందరికీ రవీంద్ర వివాహితుడన్న విషయం తెలుసన్నమాట. తనకొక్కదానికే వన్నమాట యింత ఆలస్యంగా తెలిసింది తన వెర్రిగాని. ముప్పైఐదేళ్ళవాడు సంఘంలో స్థిరమైన ఉద్యోగాన్ని, స్థానాన్ని ఏర్పరచుకున్నవాడు యింకా అవివాహితుడిగానే ఉండిపోతాడని ఎలా ఊహించుకుంది. అసలతను వివాహితుడై ఉండివుండవచ్చునేమోనన్న ఊహకూడా తనకి రాలేదు. అందుకే కాబోలు అంటారు ప్రేమ గుడ్డిదని. నిజంగానే ప్రేమ తన కంటికీ, మనసుకీ అన్నిటికీ పొరలు కప్పింది. లేకపోతే నిన్నమొన్నటివరకు రవీంద్ర వివాహితుడన్న విషయమే తెలుసుకోలేకపోయింది తను రవీంద్ర వివాహితుడు, తండ్రి కనుకనే తన తల్లిదండ్రులు, అన్నయ్యావాళ్ళంతా అతనితో తనని చనువుగా ఉండనిచ్చేరు. ఆ సంగతి తను గ్రహించనే లేకపోయింది. ఎంత పిచ్చిది తను! "భగవాన్! నా జీవితనౌక సరిగ్గా యిప్పుడు నడిసముద్రంలో నిల్చి ఉంది ఒడ్డుకు చేర్చుతావో, నీటిలో ముంచుతావో అంతా నీదే భారం! నా చేతిలో యేమీ లేదిప్పుడు. అంతా నా చెయ్యి దాటిపోయింది. నేను నిస్సహాయురాలిని...." అంటూ రోదించింది మెహర్.

## 10

మర్నాడు సాయంత్రం గఫర్‌ఖాన్ ఇల్లంతా రంజాన్ పండుగ సంబరాలతో కళకళలాడిపోతోంది. బంధువులు, స్నేహితులు ఎందరో వచ్చి, ఆప్యాయంగా కౌగలించుకుని పండుగ శుభాకాంక్షలను తెలుపుకున్నారు. తీపితిని, చేతికి సెంటు రాయించుకుని వెళ్ళిపోయేరు. ఆరున్నర దాటిన తరువాత రవీంద్రకూడా వచ్చేరు.

దాదాపు నెల రోజుల తరువాత రవీంద్రను చూడగానే మెహర్ గుండె గుబగుబలాడింది. అతను తనకెంతో పరాయివాడైనట్లు, తనకీ, అతనికీ మధ్య ఒక పెద్ద అగాధం ఏర్పడి పోయినట్లు అనిపించిందామెకు. తన ప్రాణశక్తినంతటినీ కూడదీసుకుని, ఆ అగాధాన్ని దాటి అతని కౌగిలిలో కరగి పోవాలి. కాని అదెలా సాధ్యం?

"బాగున్నారా?" అని చిరునవ్వుతో పలకరించింది అందరి ముందూను. ఆ తరువాత ఆమెకు మాట్లాడటానికేమీ తోచలేదు.

రవీంద్ర అందరికీ "ఈద్ ముబారక్" చెప్పిన తరువాత గఫర్‌ఖాన్ "ఈ మధ్య రావటం మాని వేసేరేం డాక్టర్

సాబ్," అనడిగేరు.

తాహెరా "మీ బీబీని. పిల్లలను తీసుకురాలేదేః" అని ఆప్యాయంగా అడిగింది.

"మెహర్‌ని యీరోజు మా యింటికి తీసుకు వెళ్దామనుకుంటున్నానండీ మా ఆవిడ మెహర్‌ని చూడాలని ఎంతో ఉవ్విళ్లూరుతోంది. తనకి కొత్తవాళ్ళ మధ్యకి రావాలంటే తగని సిగ్గు. కాస్త పాత కాలం మనిషిలెండి లక్ష్మి" అన్నాడు రవీంద్ర.

ఆ మాటలు వింటూనే మెహర్ ఇతని వంక వక్రమంగా చూసింది. రవీంద్ర ఆమె కళ్ళలోకి లోతుగా చూసేడు.

మెహర్ కళ్ళు వాల్చుకుంది.

రవీంద్ర షీర్‌ఖుర్మా. సేమియా తిన్నాడు. కోకాకోలా త్రాగేడు. అహమ్మద్ అతని చేతికి ఘాటైన సువాసన గల సెంటును వ్రాసేడు.

కాసేపు అవీయివీ మాట్లాడి "ఇంక యింటికి వెళ్దామా మెహర్? లక్ష్మి మన కోసం ఎదురు చూస్తుంటుంది." అన్నాడు రవీంద్ర మామూలుగా.

మెహర్ తండ్రి వంక, తల్లి వంక చూసింది. "వెళ్లు బేటీః డాక్టర్‌సాబ్ బలవంతం చేస్తుంటే వద్దనటం బాగుండదు." అన్నాడు గఫర్‌ఖాన్.

"డాక్టర్ సాబ్ నీకు అన్నలాంటి వాడు. వెళ్ళమ్మాః ఇవ్వాళ పండుగ రోజు కూడాను. ఎక్కడికీ స్నేహితు రాళ్ళిం




అవును...
సాలోఫెన్
బాధానివారిణి మాత్రలు
తలనొప్పి, ఫ్లూ, పంటినొప్పి, ఒళ్లునొప్పులని
వెంటనే పోగొడ్తాయి
సాలోఫెన్‌లోని ఔషధాలు డాక్టర్లు సిఫార్సు చేసినవే!
సాలోఫెన్ ఉన్నచోట బాధ ఉండదు.




ఇది అమృతాంజన్ లిమిటెడ్ వారి
తయారింపే అని గుర్తు ఉంచుకోండి.

టికి పోలేము. డాక్టర్ సాబ్ యింటికన్నా వెళ్ళు." అంది తాహెరా.

"భయ్యా! నా వెంట నువ్వుకూడా రారాదూ!" అనడిగింది.

"నా స్నేహితులను కలుసుకోవాలి. నేను వెళ్లకపోతే ఊరుకోరు. ఇప్పటికే ఆలస్యం అయింది. వాళ్లు నాకోసం వెయిట్ చేస్తుంటారు" అన్నాడు అహమద్.

"మీకేం భయమక్కర్లేదు. ఒక్క గంట కూర్చోండి. మళ్ళీ నేనే స్వయంగా మీ యింటి దగ్గర దిగబెడ్తాను." అన్నాడు రవీంద్ర.

పావు గంటలో ముస్తాబై తయారయింది మెహర్. తెల్లని నైలెక్స్ చీర, అదేరంగు బ్లౌజు, వదులుగా వేసుకున్న జడ, చెవులకు ముత్యాలు పొదిగిన రింగులు, చేతులకు ముత్యాల గాజులు వేసుకున్న మెహర్ రవీంద్ర కంటికి అప్సరసలా కనపడింది. అతని చూపులలోని ఆకలిని, ఆరాధనను గమనించిన మెహర్ మరింత వయ్యారంగా, శరీరంలోని ఒంపులన్నీ అతనికి కనపడేలా నడుస్తూ వెళ్లి కారులో కూర్చుంది. ఆమె పక్కనే కొంచెం దూరంలో రవీంద్ర కూర్చున్నాడు.

రవీంద్ర చెల్లాచెదురౌతున్న మనసును కుదుట పరుచుకుంటానికి తాపత్రస్తులా ప్రయత్నిస్తున్నాడు.

మెహర్ తన శరీరంలోని అణువణువు లోను ఉప్పొంగుతున్న కోర్కెలను అణచుకోవటానికి ప్రయత్నించింది. విఫలురాలౌతోంది.

డ్రైవరు ఉండటంవల్ల వాళ్ళిద్దరూ ఎక్కువగా మాట్లాడుకోవటానికి అవకాశం లేకపోయింది.

సగందూరం పోయిన తరువాత రవీంద్ర మెల్లగా అన్నాడు. "మెహర్! మా యింటికి నిన్నెందుకు తీసుకు వెళ్తున్నానో తెలుసా?" అన్నాడు.

"ఊఁహూఁ. తెలియదు. చెప్పండి." అంది అతని కళ్ళలోకి చిలిపిగా చూస్తూ.

"ప్రేయసీ ప్రియులుగా మనం జీవించేందుకు నోచుకోలేకపోయినా, కనీసం స్నేహితులుగానైనా మనం ఆజన్మాంతరం కలిసి ఉందాం. నీకు దూరంగా నిన్ను చూడకుండా ఉండే శక్తి నాకు లేదు. అందుకే నువ్వు మా ఫామిలీ ఫ్రెండువు కావాలి మా యింటిలో ఒకదానివి కావాలి ఆ మాత్రం తృప్తినైనా నాకు లభించేటట్టు చెయ్యి మెహర్!" అన్నాడు.

మెహర్ కళ్ళ వెంబడి నీళ్లు తిరిగినయ్.

సమాధానం చెప్పకుండా ముఖం పక్కకు తిప్పుకుంది. ఆమె శరీరంలో కోరికల వేడి, మనసులో ఆవేదన మంటలు రెంటికీ మధ్య నలిగిపోతూ నిస్సత్తువగా కూర్చుంది మెహర్.

రవీంద్ర యింటి ముందు కారాగింది.

లోపలికి వెళ్ళగానే రవీంద్ర చెల్లెలు సరళ ఎదురు వస్తూ వచ్చింది.

"అన్నయ్యా! ఈ మేనా మెహర్ అంటే! అబ్బ ఎంత అందంగా ఉందో!" అంది.

మెహర్ చిరునవ్వు నవ్వింది. కాని ఆ నవ్వులో జీవం లేదు.

"చదువుకుంటున్నావా?" అడిగింది మెహర్.

"ఇం. టెన్త్ క్లాసు చదువుతున్నాను. కూర్చోండి. మా వదినను పిలుచుకు వస్తాను" అంటూ తుర్రున లోపలికి పరుగెత్తింది సరళ.

"మీ చెల్లెలు చాలా చలాకీగా ఉందే" అన్నది మెహర్.

"ఔను మరి. నా చెల్లెలు కదూ!" అంటూ నవ్వేడు రవీంద్ర. "అది పుట్టగానే మా అమ్మా నాన్నా యిద్దరూ పోయేరు. కాని ఆలోటు కనపడనీయకుండా లక్ష్మి దానిని ఎంతో గారాబంగా పెంచింది. పదిహేనేళ్లు నిండినా యింకా పసిపిల్లలానే చూసుకుంటుంది సరళని" అన్నాడు రవీంద్ర.

అతనలా తన భార్యని గురించి మెచ్చుకుంటూ చెప్పటం ఎందుకో బాధనిపించింది. మెహర్‌కి.

ఇంతలో "డాడీ, డాడీ" అంటూ పదేళ్ళ కుర్రవాడు, ఏడేళ్ళ పిల్ల బయటకు వచ్చేరు.

"ఆంటీకి నమస్తే చెయ్యండి." అన్నాడు రవీంద్ర.

"నమస్తే ఆంటీ" అంటూ యిద్దరూ ఏక కంఠంతో పలికేరు.

"నమస్తే" అంటూ మెహర్‌కూడా చేతులు జోడించింది. అలా నమస్కరించటం అలవాటు లేనందున వెంటనే




ఉత్తమమయిన మొటిమల మందు
నిటిల్
మందుగల మొటిమల మలము

- 2 శాతము మాత్రమే గంధకముకల మలము
- సూక్ష్మజీవులను నశింపచేయును
- విటమిన్ 'ఎఫ్' మొటిమల గుర్తులను పోగొట్టి చర్మమును నున్నగా మెత్తగా చేయును.

గార్లిక్ ఫామ్ (ప్రై) లిమిటెడ్
యూని డిస్ట్రిబ్యూటర్స్ ప్రైవేట్ లిమిటెడ్

సిగ్గు పడింది.

ఇంతలో లక్ష్మి రెండేళ్ళ కొడుకుని ఎత్తుకుని బయటకు వచ్చింది.

"రా లక్ష్మీ! నేను "మెహర్" అని రోజూ చెప్తుంటానే .... గఫర్‌ఖాన్ గారి గారాల పట్టి— ఆ పిల్లే యీమె. ఈవిడ నా భార్య లక్ష్మి...." అంటూ యిద్దరినీ ఒకరినొకరికి పరిచయం చేసేడు రవీంద్ర.

రెండుచేతులూ జోడించి విభ్రమంగా చూస్తూ నిలబడింది మెహర్.

లక్ష్మిది నిమ్మపండు రంగు శరీర ఛాయ. భారీవిగ్రహం. బర్మా ముడిలో కదంబమాల. నుదుట నయాపైసంత పట్టుని కుంకుమ బొట్టు. మెడలో నాలుగు పేటల చంద్రహారం, రెండు పేటల పుస్తెలతాడు, నల్లపూసల దండ నిండుగా ఉన్నాయ్. ముదురాకు పచ్చ రంగులో ఉన్న వెంకటగిరి జరీ చీర, కుంకుమ రంగు జాకెట్టు ధరించింది. చెవులకు ముత్యాల దిద్దులు, రెండు చేతుల నిండా ఆరేసి బంగారు గాజులమధ్య ఆరు మట్టి గాజులుకూడా ఉన్నయ్.

ఆమె ముఖం ఎంతో ప్రశాంతంగా, గంభీరంగా ఉంది.

ఆమె ముఖం వంక చూస్తున్న కొలదీ తన మనసులో ఎంతో వెలితి, అసంతృప్తి ఉన్నట్లు గ్రహించింది మెహర్. తన కెందుకలా అనిపిస్తోందో తనకే అర్థం కావటం లేదు.

"కూర్చోమ్మా! కూర్చో! నిలబడ్డా వెందుకు? నిన్ను చూస్తుంటే మా రెండో చెల్లెలు ఉన్నేళ గుర్తుకు వస్తోంది. అది అచ్చు నీలాగే ఉంటుంది." అన్నది లక్ష్మి. ఆమె అలా ఆప్యాయంగా మాట్లాడేసరికి మెహర్ కళ్ల చెమర్చినయ్.

మెల్లగా కూర్చుంది. నౌకరు ఏవేవో తినుబండారాలు తెచ్చేడు కాని అవేమీ తినలేక పోయింది మెహర్. కొంచెంగా టీ మాత్రం తాగింది.

తరవాత లక్ష్మి "రా! మా యిల్లు చూద్దువు గాని" అంటూ మెహర్‌ని లోపలికి తీసుకు వెళ్ళింది. లక్ష్మి, సరళ యిద్దరూ మెహర్‌కి యిల్లంతా చూపించేరు. లక్ష్మి ఆమె ఉన్నంతసేపూ ఏదో ఒకటి మాట్లాడు తూనే ఉంది. కాని ఆమె మాటలు ఎంతో మృదువుగా, నెమ్మదిగా ఉండటంవల్ల ఆమె మాట్లాడి నట్లే అనిపించదు. కాని సరళ అలా కాదు. మాట్లాడినది కొంచెంసేపైనా గలగల మాట్లాడేస్తుంది. ఎదుటి వ్యక్తికి మాట్లాడేందుకు తావీయకుండా.

ఇంటిలోని వస్తువులూ, అలంకరణ ధనిక కుటుంబానికి చెందిన హిందువుల యిళ్ళలోలానే ఉంది. వెంకటేశ్వరుని కాలెండరు దగ్గరనుండి పీనస్ శిల్పం వరకు రకరకాల వస్తువులు యింటి గోడల మీద. బల్లల మీద ఉన్నయ్.

చివరకు రవీంద్ర పైంటింగ్సు ఉన్న గదిలోకి వెళ్ళేరు. గ్ ్తులో అడుగు పెట్టగానే ఎదురుగా తన ఎత్తుపై జాలో

తన తైలవర్ణచిత్రం చూస్తూనే విభ్ర మంగా నిలబడిపోయింది మెహర్.

"అలా చూస్తావేం? అది నీ బొమ్మే" అంది లక్ష్మి నవ్వుతూ.

'అన్నయ్య వేసిన బొమ్మ చూసి మీరు చాలా అందంగా ఉంటారని నేను అప్పుడే ఊహించుకున్నాను. కాని ఆ బొమ్మకంటేకూడా మీరు యింకా బాగున్నారు ' అంది సరళ.

మెహర్‌కి తన చిత్రాన్ని చూసుకోవటానికి రెండు కళ్ళూ చాలవనిపించింది. కాని అదేపనిగా చూస్తే వాళ్ళిద్దరూ ఏమనుకుంటారోనని చూసీ చూడనట్లు ఆ గదిలో ఉన్నంతవరకు పరిశీలనగా ఆ చిత్రాన్నే చూసింది మెహర్.

రవీంద్ర యేదో మామూలు ఆర్టిస్టు అనుకుంది కాని యింత గొప్ప చిత్రకారుడని ఊహించనుకూడా లేదు. తన శరీరంలోని ప్రతి సౌందర్యరేఖను, తన శరీరఛాయలోని వివిధరకాల 'షేప్స్' ని ఎంత చక్కగా చిత్రించేడు! ఆ చిత్రాన్ని చూస్తుంటే తనకే మతిపోతోంది. అంతటి సౌందర్యం తనలో ఉన్నదని తనకే తెలియదు అందుకే కాబోలు రవీంద్ర భార్యని, ముగ్గురు పిల్లలనుకూడా మర్చిపోయి, తనని అంత వెర్రిగా ప్రేమిస్తున్నాడు. కళాకారుడికి తప్ప మరెవరికి అర్థమవుతుంది సౌందర్యంలోని మహిమ?


దంత క్షయం ఉండదు!

స్టాండర్డ్, డీలక్స్, సూపర్, జూనియర్ మరియు ...
తరగతులలో హార్డ్
మీడియం మరియు సాఫ్ట్ రకములలో లభిస్తాయి.



ఆర్యన్ టూత్ బ్రష్
ఎక్కువ బాగా శుభ్రం చేస్తుంది—
ఎక్కువ కాలం మన్నుతుంది.

ఇంకా ఇప్పుడు ఆర్యన్
షేవింగ్ బ్రష్-ఇది





అంత గొప్ప కళాకారుడి ప్రేమను పొందటం నిజంగా తన అదృష్టం. కాని తానకని ప్రేమను నిలుపుకోగలదా!

మెహర్ లక్ష్మివంక చూసింది. ఒక్క-క్షణంపాటు ఆమె భాకీవిగ్రహాన్ని చిత్రంలోని తన సుకుమార శరీరంతో పోల్చుకుని చూసేసరికి లక్ష్మి ఆమె కంటికి ఎంతో అసహ్యంగా కనిపించింది.

కాని లక్ష్మి ముఖంలో తాండవిస్తున్న ప్రశాంతత, నైర్మల్యం ఆమె మనసును వెంటనే లోబరుచుకున్నయ్. లక్ష్మి తన ముందు అందంలో ఎందుకూ కొరగాని మాట నిజమే! కాని తనలో లేనిది తాను జీవితంలో ఎన్నడూ పొందలేనిదీ, కలలో కూడా తాను చేరుకోలేనిదీ ఏదో ఒక మహత్తమైన భావముద్ర లక్ష్మి ముఖంలో స్పష్టంగా కనిపిస్తోంది.

అందుకే లక్ష్మిని అసహ్యించుకోలేక పోతోంది తను. ఆమెను చులకనగా చూడలేకపోతోంది.

పైగా ఆమెను చూస్తుంటే తనలో యేదో భయం, భక్తికూడా ఏర్పడుతున్నయ్.

"ఏమిటలా పరధ్యాన్నంగా ఉన్నారు? మా యిల్లు నచ్చిందా! మీ యిల్లు యింతకంటె చాలా అందంగా ఉంటుందని మావా రన్నారు. మా డ్రైవరు కూడా చెప్పేడు" అంది లక్ష్మి.

ఆమె అమాయకత్వం చూస్తుంటే సిగ్గనిపించింది మెహర్ కి.

ఆమె మనసులో ఏదో అశాంతిగా, అలజడిగా ఉండటంవల్ల అక్కడ ఒక్క-క్షణంకూడా ఉండ బుద్ధికాలేదు మెహర్ కి. తన మనసులో ఏదో కల్మషం ఉన్నట్లు దేవాలయంవంటి ఆ యింటిలో తనకి స్థానంలేనట్లు ఊహించుకుని పరితపించింది ఆమె హృదయం.

"ఇంక వెళ్తానండీ! చాలా పొద్దుపోయింది. మావాళ్లు నాకోసం యెదురు చూస్తుంటారు" అంది మెహర్.

"అలాగే. వెళ్ళమ్మా! అప్పుడప్పుడు వస్తూండు" అన్నది లక్ష్మి.

వెళ్ళబోయే ముందు "తప్పకుండా వస్తాను కదూ?" అనడిగింది సరళ.

"ఆంటీ, టాటా!" అంటూ పిల్లలు ముగ్గురూ వీడ్కోలు చెప్పేరు.

"మా యిల్లంతా చూసినట్లేగా? ఇంక పద. ఇంటిదగ్గర దింపుతాను" అన్నాడు రవీంద్ర నవ్వుతూ. తెల్లగా, పొందికగా ఉన్న ఆతని పలువరస వంక ఓసారి చూసి వెంటనే లక్ష్మి ముఖంలోకి చూసింది మెహర్. చిరునవ్వుతో వెలిగిపోతున్న లక్ష్మి ముఖంలో మొట్టమొదట ఆమెకు కనపడింది ఎఱ్ఱగా మెరిసిపోతున్న కుంకుమ బొట్టు తన గుండెలోని రక్తం ఒక్కొక్క బొట్టూ పోయి ఆమె ముఖాన్ని కుంకుమరేఖలా అలంకరిస్తున్నట్లు అనిపించింది మెహర్ కి.

వెంటనే కళ్లు వాల్చుకుని "పదండి, వెళ్దాం" అన్నది రవీంద్రతో.

ఇద్దరూ కారులో కూర్చున్నారు. కారు రివ్వున సాగిపోతోంది. ఆ వేగం ఆమెలో ఏదో ఉత్తేజాన్ని కలిగించింది. రివ్వున వచ్చి శరీరాన్ని తాకుతున్న గాలులు నిప్పులా కాలిపోతున్న ఆమె దేహంలోని ఉష్ణతను మరింత ఉధృతం చేసినయ్. ఆమె చాలాసేపు మౌనంగా కళ్లు మూసుకుని కూర్చుంది. రవీంద్రకూడా కారు డ్రైవ్ చేస్తూండటంవల్ల రోడ్డువంకనే తదేకంగా చూస్తున్నాడు.

కళ్లు మూసుకున్నప్పుడల్లా మెహర్ మనోనేత్రం ముందు ఎఱ్ఱగా జ్వలిస్తున్న లక్ష్మి నుదుటిమీది కుంకుమరేఖ, రవీంద్ర గదిలోని తన చిత్రమే కదలసాగినయ్. ఆ రెండు బొమ్మలూ ఒకదాని వెంట ఒకటి పోటీపడుతూ ఆమె కళ్ళముందు పరుగుపెడ్తూంటే ఆ వేగాన్ని చూసే శక్తిలేక చటుక్కున కళ్లు తెరచింది మెహర్.

"డాక్టర్!" అంటూ సీటుమీదకు వంగి అతని మెడచుట్టూ చేతులు వేసింది మెహర్.

వేడిగావున్న ఆమె అరచేతులను చూసి ఆమె మనశ్శరీరాలలోని తీవ్రతను గ్రహించగలిగిన డాక్టర్ జవాబుగా ఎడమ చేతిని వెనుకకు పోనిచ్చి, ఆమె పెదవులను వేళ్ళకొనలతో స్పృశించేడు.

"డాక్టర్! నా రవీంద్రా! నేను భరించలేను. ఈ స్థితిని నేను భరించలేను. ఎన్నెక్కడికైనా తీసుకువెళ్లు డాక్టర్! ఈ మనుషులందరికీ దూరంగా నన్నెక్కడికైనా తీసుకుపో. ఇంటికిమాత్రం వద్దు" అంటూ అతనిచేతిలో ముఖం పెట్టుకుని ఏడ్చింది మెహర్.

మృదువుగావున్న ఆమె కపోలాలు అతని చేతిని, మెడని కప్పివేసి, అతని మనసుకు గిలిగింతలు పెడ్తోంది. ఆమె శరీరంనుండి వస్తున్న వింత పరిమళాలు అతనిని మత్తెక్కిస్తున్నయ్.

కొద్ది నిమిషాల అనంతరం ఊరికి దూరంగా నిర్మానుష్యంగా ఉన్న ప్రదేశంలో కారాగింది.

కారుదిగి మెహర్‌వంక చూసి "రా!" అంటూ రెండుచేతులూ చాపేడు రవీంద్ర.

మరుక్షణమే అతని బాహువులలోకి వాలిపోయింది మెహర్.

తెల్లని నైలెక్సు చీర వెన్నెట్లో మెరిసిపోతోంది. ఆ పల్చని చీరమాటున అస్పష్టంగా కనపడుతున్న సౌందర్యసీమలన్నిటినీ స్పృశిస్తూ ఆమెను రోడ్డు దాటించి, చాలాదూరం తీసుకుపోయేడు రవీంద్ర. పచ్చని ఆకు చెప్పులు వేసుకున్న మెహర్ కఠినంగావున్న నల్లరేగడి నేల మీద పొలాలమీదుగా నడుస్తూ అతనితో నడచింది. ఆమె యింక నడవలేక వెంటనే కూలబడింది.

"రవీంద్రా! నా డార్లింగ్!" అంటూ అతనిని దగ్గరకు లాక్కుంది. "రవీంద్రా! ఈరోజు రంజాన్! అల్లా సాక్షిగా చెప్తున్నాను. నేను నీ దానినే! నా సమస్తం

# మీ సేవాభిలాషి

# స్టేట్ బ్యాంక్ ఆఫ్ హైదరాబాద్

స్టేట్ బ్యాంక్ ఆఫ్ హైదరాబాద్‌తో మీరు వ్యవహరించేటప్పుడు, మీరు సామాన్యమైన బ్యాంకింగ్ సౌకర్యాలన్నీ పొందుతారు. అంతేకాదు. మరో ప్రత్యేకత కూడా!

మీ గురించీ, మీ ఆర్థికవిషయాల గురించీ వ్యక్తిగతంగా మేము తీసుకునే శ్రద్ధే ఈ ప్రత్యేకత. మేము చూపే శ్రద్ధ విషయంలో, మాకు ఏ ఒక్కరూ తక్కువ వారనిపించరు. సేవచేయటమే మా లక్ష్యం. ఆ సేవనే సకాలానికి, సామర్థ్యంతో, సగౌరవ ప్రదంగా అందజేస్తాము.

ప్రధాన కార్యాలయ భవనం
హైదరాబాద్.




స్టేట్ బ్యాంక్ ఆఫ్ హైదరాబాద్

నీకు అర్పిస్తాను. నువ్వు లేకుండా ఒక్క-
క్షణంకూడా బ్రతకలేను నేను. నీ కభ్యం
తరం లేకపోతే నేను నిన్ను పెళ్ళిచేసు
కుంటాను. మా మహమ్మదీయులలో
పురుషుడు నలుగురు భార్యలను ఉంచుకో
వచ్చు నేను నీకు రెండవ భార్యగా ఉండ
టానికి సిద్ధంగా ఉన్నాను" అన్నది.

"మెహర్! నువ్వు ఆవేశపడు
తున్నావు....' అంటూ ఆమెను గట్టిగా
కౌగలించుకుని మరింత ఉద్రిక్తపరచేడు
రవీంద్ర. "నేను హిందువుని. ఇద్దరు
భార్యలు .."

'లేదు ఆవేశపడటం లేదు. ఈ
వెన్నెలసాక్షిగా యీ పచ్చనిచెట్ల సాక్షిగా
నేను నీ దాన్నని ప్రమాణం చేస్తున్నాను
నువ్వు హిందువుగా ఉండదల్చుకుంటే
ఉండు. నా కభ్యంతరం లేదు. నీకు
భార్యగా కాలేకపోయినా నీ ప్రేయసిగా నే
జీవితాంతం ఉంటాను. నాకు నువ్వు
కావాలి. నువ్వు కావాలి అంతే! ఆ తరు
వాత యేమైనా పరవాలేదు"

వివశమౌతున్న ఆమె శరీరాన్ని తన
సొంతం చేసుకున్నాడు ఆమెలోని సౌంద
ర్యాన్ని తనలో లీనం చేసుకున్నాడు
రవీంద్ర.

అలా కాలగమనాన్నికూడా మర్చి
పోయి ఎంతసేపున్నారో వారికే తెలియదు.

చివరికి రవీంద్రే "ఇంక వెళ్దామా,
మెహర్? మీవాళ్లు నీకోసం యెదురు
చూస్తూండవచ్చు మరీ ఆలస్యమయితే
మా యింటికి ఎవరినైనా పంపిస్తారేమో
కూడా" అన్నాడు.

"ఈ అందమైన కలలోనుండి ఆ
రసహీనమైన జీవితంలోకి పోవాలంటే
చాలా బాధగా ఉంది రవీంద్రా! ఈ
లోకంతో సంబంధం లేకుండా యిద్దరం
యిలాగే కలకాలం ఉండిపోతే, యీ
వెన్నెల ఎప్పటికీ యిలాగే నిల్చిపోతే
ఎంత బాగుండును!" అంది మెహర్
మత్తుగా

"ప్రేమికులందరూ అలాగే అనుకుం
టారు మెహర్. కాని వాళ్ళకోసమని
ప్రకృతి తన ధర్మాన్ని మార్చుకోదు
గదా!"

"అబ్బో! నీకు కవిత్వం కూడా
వస్తోందే."

"నీవంటి సౌందర్యరాశి ఒడిలో ఒరిగి
పోయినప్పుడు ఎంతటి బుద్ధిహీనుడికైనా
కవిత్వంకూడా వస్తుంది"

"నువ్వు మాట్లాడుతుంటే గంటల
తరబడి అలా వింటూ ఉండాలనిపిస్తుంది
రవీంద్రా! మనం ఒక్క పదిసంవత్సరాల
క్రితం పరిచయముంటే ఎంతో బాగుండు నని
పిస్తోంది"

"ఏం, ఇప్పుడుమాత్రం యేం తక్కు-
వయిందని"

"నువ్వు పూర్తిగా నావాడివి కావాలి.
నాకు తప్ప నీ హృదయంలో మరోస్త్రీకి
స్థానం ఉండటాన్ని నేను సహించలేను"
అంటూ అతని మెడచుట్టూ రెండుచేతులూ


యు

# ట్విన్ సిటి గ్యాస్ కం.

(కోసాన్ గ్యాస్ కంపెనీవారి ఏజంట్లు)

62-బి, సర్దార్ పటేల్ రోడ్, సికింద్రాబాదు-3 ఫోన్: 76600




**షో రూమ్:**

86, సరోజినీ దేవి రోడ్
తాజ్‌మహల్ హోటల్ ఎదురుగా
సికింద్రాబాదు.

**బ్రాంచీలు:**

| | |
|---|---|
| 4-1-881/7, తిలక్ రోడ్ | ఫోన్ 42586 |
| 15-9-311, అఫ్జల్‌గంజ్ | ఫోన్ 42629 |
| 16-6-68, చాదర్‌ఘాట్ | ఫోన్ 52400 |
| ఆంధ్ర బ్యాంక్ ఎదురుగా, విద్యానగర్ | ఫోన్ 35419 |
| సత్యా టాకీస్ వద్ద, అల్వాల్ | ఫోన్ 79009 |
| గోల్డు స్పాట్ వద్ద, అమీర్ పేట | ఫోన్ 32901 |
| భారత్ హెవీఎలెక్ట్రికల్స్ రామచంద్రపురం | |

వేసి అతని హృదయంలో ముఖాన్ని దాచుకుంది మెహర్.

"ఓహో. నీ భయం నా కర్థమయిందిలే! నా భార్య లక్ష్మిని గురించి కదూ నువ్వనేది! దానిని నేను ఏనాడూ ప్రేమించలేదు. పెద్దళ్లు పెళ్లిచేసేరు కనుక దానితో కాపురం చేస్తున్నాను. అంతే నా మనసులో సూదిమొనంతకూడా స్థానం లేదు లక్ష్మికి. సరేనా?"

"నిజంగానా రవీంద్రా? నువ్విలా మాట్లాడతావని నేనూహించనే లేదు. అసలివ్వాళ నీ కింత దగ్గరగా ఎందుకు వచ్చేనో తెలుసా లక్ష్మిని చూస్తున్నంతసేపూ నాలో ఏదో తెలియని జెలసి ప్రవేశించి నన్ను పిచ్చిదానిని చేసేసింది. ఆమె చిరునవ్వు, ఆమె ముఖంలోని ప్రశాంతత అవన్నీ చూస్తుంటే నీవంటి భర్తను పొందటంవల్లనే కదా ఆమెకంత గర్వం! అనుకున్నాను ఆ భావాన్ని నేను భరించలేకపోయేను. నా సొత్తును ఆమె అపహరించినట్లు ఫీలయ్యేను. ఆమెను చూస్తున్న కొలదీ నువ్వు నాకు ఎంతో దూరమైపోతున్నట్లు భయం వేసింది. ఏమైనా సరే ఆమెనుంచి నిన్ను దూరంచేసి నావాడిగా చేసుకోవాలనీ, నిన్ను నా సొంతం చేసుకోవాలనీ అనిపించింది."

రవీంద్ర నవ్వేడు "ఎంత పిచ్చిదానివి, మెహర్! నువ్వింకా పసిపిల్లవే!" అన్నాడు.

"కావచ్చు. అందుకే మీరు నాకంతగా నచ్చేరు. నా కెందుకో నా వయసులోని మగ పిల్లల మీద మోజులేదు. వాళ్ళను చూస్తుంటే నాలో ఎలాటి శృంగార భావాలూ కలగవు. నా తోటి అమ్మాయిలందరిలానే వాళ్ళుకూడా స్నేహితుల్లా కనిపిస్తారు అంతే! మనిద్దరి మధ్య వయోభేదం ఎక్కువగా ఉన్నా మీ మీద నాకు కలిగిన ఆకర్షణకి ఒక కారణం. నా స్వభావం నాకే చిత్రంగా ఉంది."

ఇంతలో ఎక్కడో ఫెళఫెళమంటూ ఒక్క ఉరుము ఉరిమింది. ఇద్దరూ ఉలికిపడి ఆకాశంలోకి చూసేరు. తామంత వరకు గమనించలేదు. ఆకాశంనిండా దట్టంగా అల్లుకుపోతున్నాయ్ నల్లని మేఘాలు. ఆ మబ్బుల చాటునుండి అప్పుడప్పుడు తొంగిచూస్తున్నాడు చందమామ.

"వర్షం వచ్చేట్టుంది. పద" అన్నాడు రవీంద్ర కంగారుగా.

మెహర్ కూడా లేచింది.

ఇద్దరూ వడివడిగా అడుగులువేస్తూ పొలాలు దాటుకొని రోడ్డువైపుకు నడచేరు. ఎంత త్వరగా నడచినా కొన్ని పెద్దపెద్ద చినుకులు వాళ్ళమీద పడినయ్.

కొద్దిగా తడిసిన బట్టలతో యిద్దరూ వెళ్ళి కారులో కూర్చున్నారు. కారు రివ్వున సాగిపోయింది.

కారులో కూర్చునంతసేపూ మెహర్ రవీంద్ర ఒడిలో తలపెట్టుకునే ఉంది. తమ వీధిలోకి కారు ప్రవేశించేసరికి చటు



యూ

క్కున లేచి కూర్చుంది. అప్పటికే వర్షం పెద్దదయింది. తనింకా రవీంద్ర ఒడిలో నుండి లేవకముందే ఎవరో తనకి పరిచయమైన వ్యక్తి తన ప్రక్కనుండే వెళ్ళటం గమనించింది. పూర్తిగా లేచి కూర్చున్నాక అతనెవరో గుర్తుకువచ్చేడు అతను దర్జీ గోపాలం. రాత్రి పదిగంటలు దాటటంవల్ల షాపు మూసేసి యింటికి బయల్దేరినట్లున్నాడు గోపాలం. అంత వర్షంలోనూ పరుగు పెడ్తూనే అతను కారు లోకి తొంగిచూసేడు. అందులో సందేహం లేదు. గోపాలం తనని చూసేడు! మెహర్‌కి అంత చలిలోనూ ముచ్చెమటలు పోసినయ్. కాని వెంటనే మొండిధైర్యం తెచ్చుకుంది.

"చూస్తే నాకేం? నేను ప్రేమించిన వ్యక్తిని. నన్ను ప్రేమించిన వ్యక్తిని కావాలనుకున్నాను. నా వాడిని చేసుకున్నాను. అందులో తప్పేముంది?" అనుకుంది.

ఇంటిముందు కారాగగానే డోర్ తెరచుకుని బయటకు వచ్చింది మెహర్. కుండపోతగా వర్షం కురుస్తున్నా లెక్క చెయ్యక అక్కడే నిలబడి తడుస్తూ లోపలికి ముఖం పెట్టింది మెహర్. రవీంద్ర ఆమె పెదవులపై చిన్నగా ముద్దు పెట్టుకున్నాడు. "ఇక త్వరగా లోపలికి వెళ్ళు తడిస్తే జ్వరం వస్తుంది. రేపు త్రీ పీ పెస్‌లో కలుసుకుందాం... సాయంత్రం ఐదు గంటలకు" అన్నాడు.

ఆరోగ్య, అనారోగ్య పరిస్థితులలో
లోధ్ర
మహిళలు ఆధారపడునది
ఆరోగ్య సౌభాగ్యములను
70 సంవత్సరముల పైగా
ప్రసిద్ధినొందినది
కేసరి కుటీరం
(ప్రైవేట్) లిమిటెడ్
రాయపేట మద్రాసు-14
ఏజెంట్లు సీతారామ జనరల్ స్టోర్సు (ఏజన్సీస్)
విజయవాడ సికిందరాబాదు మధుర
బెంగుళూరు

మా ఇతర ఔషధములు:-
గర్భపోషణకు, సుఖ ప్రసవమునకు
గర్భరక్షక
వేవిళ్ళకు, మలబద్ధకమునకు:
మాదీఫల రసాయనం
ప్రసవానంతరం బలమునకు,
క్షీరవృద్ధికి:
సౌభాగ్య శొంఠి.

మెహర్ లోపలికి పక్కగెత్తుకుంటూ వచ్చింది. ఆమె వచ్చేసరికి యింట్లో అంతా నిద్రపోతున్నారు.

నౌకరు తలుపు తీసేడు. "భోజనం వడ్డించమంటారా?" అనడిగితే వద్దని చెప్పి తన గదిలోకి వెళ్ళిపోయింది మెహర్.

తడిసిన నైలెక్సు చీరలో పాలరాతి శిల్పానికి చైతన్యం వచ్చినట్లు ఆమె నడుస్తూ వెళ్తుంటే వెనుకనే నిలబడి గుడ్లప్పగించి చూసేడు నౌకరు.

మెహర్ గది తలుపులు బిగించి నిలువుటద్దం ముందు నిలబడింది. అద్దంలో తన ప్రతిబింబాన్ని చూసుకుంటుంటే తనకే ఎంతో మనోహరంగా ఉంది. రవీంద్ర స్పర్శ కలగటంవల్ల తన శరీరంలోని అణువణువూ సౌందర్యంతో నిండిపోయినట్లనిపించింది.

ఇప్పుడు తను కన్యకాదు. కొద్ది గంటల క్రితం మెహర్‌కీ యిప్పటి మెహర్‌కీ పోలికే లేదు.

ఆ ఆలోచన ఆమెకు సంతోషాన్నీ, భయాన్నీ, ఉద్రేకాన్నీ కలిగించింది

అలా ఎంతోసేపు అద్దం ముందే నిలబడి తనని తాను పరిశీలనగా చూసుకుంటూ అలసిపోయి చివరకు ఆ తడి గుడ్డలతోనే మంచంమీద వాలిపోయింది మెహర్.

బయట పెళపెళమనే ఉరుములు, మెరుపులు. కుండపోతగా కురుస్తున్న వర్షం.

గదిలోపల మెత్తని పరుపుమీద తడి గుడ్డలలో వళ్లు మరచి నిద్రపోయింది మెహర్.

## 11

రోజులు దొర్లిపోతున్నాయ్. రవీంద్రా మెహర్‌ల ప్రణయ జీవితం ఆరు నెలలపాటు రసభరితంగా సాగిపోయింది. ఆ ఆరు నెలలలోనూ పరస్పరా లింగనంలో మైమరచిపోయి ఉన్న గంటలు యిట్టే నిముషాల్లా దొర్లిపోయి నట్లనిపించేవి. దూరంగా ఉన్న గంటలు యుగాలుగా తోచి బాధ పెట్టేవి

రవీంద్రతోటి అనుబంధం సన్నిహిత మౌతున్న కొలదీ, అతని మీద మరింత ఆకర్షణ కలుగుతోంది మెహర్‌కి. రవీంద్ర స్పర్శ తప్ప ప్రపంచంలోని యే యితర విషయం కూడా ఎంతో అర్థ హీనంగా, కనపడుతోందామెకు పొరపాటున ఒక్క రోజు ఏదైనా పని మీద ఉండి రవీంద్ర మెహర్‌ని చూడలేక పోయేడో ఆమె ఆ రోజల్లా భోజనం చేసేది కాదు నిద్ర పోయేది కాదు. రాత్రల్లా ఒంటరిగా గదిలో కూర్చుని వెక్కి వెక్కి ఏడ్చేది. మర్నాడు ఎట్టాగా వాచిన కళ్లతో పీక్కుపోయిన ముఖంతో కనపడే మెహర్‌ని చూసి ఆశ్చర్య పోయేవాడు రవీంద్ర.

(ఇంకా వుంది)

Published by A. [illegible] Rayudu at No. 1, Arcot Road, Madras-26
and Printed by G. Veera Brahmam at his Anuradha Acchagam,
146, T. H. Road. Madras-21.

# ఇదిగో ఒక నిరపాయమైన తలనొప్పి బిళ్ల!



అవేదన్®

ఆశ్చర్యకరమైన ఎపెప్‌గలది

(ఎన్-అసిటైల్-పి-అమినోఫినాల్)



తలనొప్పి బిళ్లను వేసుకొనుటకు భయపడి మీరు ఎన్ని సార్లు తలనొప్పిని ఎక్కువ సేపు అనుభవించారు?

అవేదన్ మీ తలనొప్పికి నిరపాయమైనది. ఎందుకంటె, దానిలో ఆశ్చర్యకరమైన ఎపెప్ ఉంది. అవేదన్‌తో చికాకైన చెడు ఫలితములు కలుగవు. దానితో ఉపశమనము కలుగుతుంది—త్వరగా మరియు నిశ్చయముగా.

కనుక తలనొప్పిని పోగొట్టుకోండి—నిరపాయముగా. జలుబు, ఫ్లూ, యితర నొప్పులు కూడా దీనితో పోతాయి. ఎపెప్‌గల అవేదన్‌ను పొందండి.





ఆశ్చర్యకరమైన ఎపెప్‌గల అవేదన్ తలనొప్పి, జలుబు ఫ్లూలకు నిరపాయమైన, నిశ్చయమైన ఉపశమనమును కలిగిస్తుంది.



SQUIBB SARABHAI CHEMICALS

® ఇ.ఆర్. స్క్విబ్ & సన్స్ ఇన్‌కార్పొరేటెడ్ వారి రిజిస్టర్డ్ ట్రేడ్ మార్కు చిహ్నము. దీని వాడకందారు ఉపయోగదారులు కరంచంద్ ప్రేంచంద్ ప్రైవేట్ లిమిటెడ్.

Shilpi HPMA 37A/70 TEL

& Fifty Paise


ప్రతియింట తప్పకవుండదగిన

# జిందా

## తిలిస్మాత్




దగ్గు, జలుబు, తలనొప్పి
ఒళ్లునొప్పులు, కలరాకు


REMEMBER THE TRADE MARK



# ఫారూఖీ

## దంతమంజన్

శుభ్రతకు, ఆరోగ్యమైన దంతములకు



తయారు చేయువారు:
కార్ఖాన జిందా తిలిస్మాత్ హైదరాబాద్